## మంచి అవకాశము


87215
S.T.D. 08555



# శ్రీసాయిహరి రియల్ ఎస్టేట్స్
## పుట్టపర్తి

మీకు పుట్టపర్తి యందు ప్లాట్లు ఇండ్ల స్థలాలు కావలసినవారు, అమ్మదలచినవారు ఈ క్రింది అడ్రసుకు సంప్రదించవలెనని కోరడమైనది.

1. సూపర్ స్పెషాలిటీ హాస్పిటల్ ఎదురుగా గల ప్లాట్లు.
2. గోకులం పోస్టాఫీస్ ఎదురుగా గల ప్లాట్లు.
3. M.R.O. ఆఫీసు ఎదురుగా గల ప్లాట్లు.
4. బీడుపల్లికి పోవు బస్సు రోడ్డుకు గల ప్లాట్లు.
5. అపార్ట్‌మెంట్స్ కావలసినవారు.
6. ప్రశాంతి నిలయము దగ్గరలో గల ప్లాట్లు.

**ప్రతినెలా 10వ తేదీన వాసవీ నివాస్ నందు డ్రా తీయబడును.**

**క్రొత్తగా ప్రవేశపెట్టిన స్కీములో చేరండి 20X40 రెండు సెంట్లకు నెలకు రు. 600-00. 36 నెలలు. "మారుతీ కారు బంపర్ డ్రా"**

ఇట్లు
శ్రీ సాయి హరి రియల్ ఎస్టేట్స్
**ప్రొ॥ పి. సిద్ధయ్య శెట్టి**
ఆర్యవైశ్య సంఘము వైస్ ప్రెసిడెంట్
ఆర్యవైశ్య సత్రం ఫ్రంట్ రూమ్, పుట్టపర్తి.

జూలై 1998

సంపుటి 14 సంచిక 7

మేనేజర్
**కొమరగిరి చంద్రశేఖర్**
24-52, రామానాయుడుపేట,
మచిలీపట్నం - 521 001.
✆ 22818, 21137

Cheques & Drafts should be drawn in favour of ***"SREEVANI"*** Monthly Machilipatnam

Edited, Printed and Published by ***Komaragiri Krishna Mohan Rao***

| | | |
|---|---|---|
| సాధారణ సంచిక | : | 5-00 |
| సంవత్సర చందా | : | 60-00 |
| 4సం॥ల చందా | : | 225-00 |
| జీవిత సభ్యత్వం | : | 600-00 |
| పోషకులు | : | 1,116-00 |
| రాజపోషకులు | : | 5,116-00 |
| మహారాజపోషకులు | : | 10,116-00 |
| ఓవర్సీస్ చందా (4 సం॥లకు) | : | 50 $ |

Printed at ***SREEVANI OFFSET PRINTERS*** Machilipatnam

*Despatched on*
**6 - 7 -1998**

# శ్రీవాణి

## సాంస్కృతిక మాసపత్రిక

సంపాదకులు : కొమరగిరి కృష్ణమోహనరావు

## విషయసూచిక


| | | |
|---|---|---|
| అమృతవాణి | కూచిభట్ల చంద్రశేఖర శర్మ | 2 |
| నటరాజశేఖర డి.వి. సుబ్బారావు | డి. వి .బి. నటరాజశేఖర్ | 3 |
| ఎందరో మహానుభావులు - 4 | భండారు పర్వతాలరావు | 8 |
| అమృతమయమైన తల్లిప్రేమ | భగవాన్ సాయి దివ్యబోధ | 9 |
| నవదుర్గలు - 8 | పురాణపండ రాధాకృష్ణమూర్తి | 18 |
| మతులు మంచివైన మతమేమి చెడ్డది | భగవాన్‌సాయిదివ్యబోధ | 19 |
| కలిమి చెలిమి | ఏకా రామచంద్రరావు | 21 |
| మనిషి - మనస్సు - 22 | పొతూరి ప్రసన్నం | 24 |
| రసవద్ఘట్టాలు - 38 | జానమద్ది హనుమచ్ఛాస్త్రి | 27 |
| మనోభిరామం - 30 | సోమంచిరామం | 28 |
| వ్యక్తులు - వ్యక్తిత్వాలు - 93 | కంచి వాసుదేవరావు | 29 |
| శ్రీ సత్యసాయి పాదుకాష్టోత్తర శతనామావళిః | ఎన్. స్వామి శాస్త్రి | 31 |


ముఖచిత్రం :
నటరాజశేఖర **డి.వి. సుబ్బారావు**

# అమృతవాణి

మనోహరం యత్సుదృఢం చ వస్తు
తదేవ దేయం న తు నష్టతుల్యం
దత్తం తు సద్వస్తు దదాతి సుష్ఠు
ఫలం హి దుర్వస్తు దదాతి దుష్ఠు

- *శ్రీ గణపతి సచ్చిదానంద*

ఇతరులకీయదలచిన వస్తువేదైనా, చక్కగా దృఢంగా వున్నదే యీయాలి పాడైపోయినది యీయరాదు. మంచి వస్తువిస్తే మంచి ఫలితం, చెడ్డ వస్తువిస్తే చెడ్డఫలితం వస్తుంది.

మనం ఎవరికైనా ఏదైనా ఇవ్వదల్చుకుంటే మనకున్న వస్తువుల్లో అన్ని విధాలా మంచిది చూచి యివ్వాలి. అంతేగాని పాడైపోయిందాన్ని, ఉపయోగించని దాన్ని ఎప్పుడూ యివ్వరాదు. అలా యిస్తే మనకే నష్టం. ఒక పండీయదల్చుకున్నారనుకోండి. ఉన్న పండ్లలో మంచిదాన్ని ఏరి కుళ్ళు, డాగు ఏమీ లేని పండును ఇతరుల కివ్వాలి. మనం తినే వస్తువు ఏదైనా సరే ఇతరులకిచ్చేది మంచిదిగా చూచి యివ్వాలి. పాడైపోయింది ఉంటే మనమే ఉంచుకోవటం మంచిది. లేక పారవేయటం మంచిది. సహజంగా లోకంలో పాసిపోయిన అన్నం, వాసన కొడుతున్న కూరలు, ఎవరికీ అక్కర్లేని వస్తువులు, పళ్ళు బిచ్చగాళ్ళకు వేస్తారు కొందరు. అది మహాపాపమని వాళ్ళకు తెలియదు. ఈ విధంగా పాపం మూట కట్టుకుంటారు. మన చేతి మీదుగా అందరికీ మంచినే పంచిపెట్టాలి కాని చెడు కాదు.

మంచి వస్తువిస్తే తీసుకొన్న వాడే కాక భగవంతుడు కూడా సంతోషిస్తాడు. చెడ్డ వస్తువిస్తే తీసుకున్నవాడు బాధపడతాడు. భగవంతుడు శపిస్తాడు.

అందుకనే మన సంప్రదాయం అతిథి అభ్యాగతులను గౌరవించటం పెట్టింది. మన యింటికి వచ్చిన అతిథి దైవంతో సమానమైన భావనతో అన్న మంచివే ఆయనకిస్తాం. చక్కని భోజనం పెడతాం ఇది మంచి సంప్రదాయం. ఇది చూచి మన పిల్లలు కూడా మంచే యితరులకు పెట్టాలని గ్రహిస్తారు.

"ఏకఃస్వాదునభుంజీత" మంచి వస్తువును నీవొక్కడవే అనుభవించరాదట. అందరికీ పంచి నీవనుభవించాలి. మన పిల్లలు తినే పదార్థం వాళ్ళ చేతనే తోటి పిల్లలకు కూడా పెట్టించే అలవాటు నేర్పాలి.

**కూచిభట్ల చంద్రశేఖరశర్మ**

ఆడవాళ్ళు నోములు చాలా నోస్తారు. ఆ నోముల్లో వాయనాలిస్తారు. దాని ఉద్దేశ్యమేమిటి? మంచి వస్తువులు ఇతరుల కిచ్చినట్లయితే భగవంతుడు సంతోషించి మనకు మంచి కలుగజేస్తాడని.

నందికేశ్వరనోములు చేసుకొని అందరినీ ఆ పదార్థం తినటానికి పిలుస్తారు. ఇది చాలా మంచి ఆచారం.

పదహారు ఫలాలనోమని నోస్తారు. ఏమాత్రం మచ్చలు డాగులు లేని పండ్లు ఏరి ముత్తైదువకు దానం చేస్తారు. అలా యిస్తే ఏ లోపం లేని సంతానం కలుగుతుందని అంటారు.

కనుక ఇతరులకిచ్చే విషయంలో జాగ్రత్తగా చూచి వ్యవహరించాలి. మంచి దానానికి మంచి ఫలితం, చెడ్డ దానానికి చెడ్డ ఫలితం రాక తప్పదు. ఇక పాప పుణ్యాలకు కారణాలు చక్కగా పెట్టిన వారికి మంచి పుట్టుక, చెడు పంచిన వారికి చెడ్డ పుట్టుక లభిస్తుందట.

అందుకనే దాన ధర్మాలు చేసే భాగ్యవంతుణ్ణి చూచి "ఆయన పెట్టి పుట్టాడురా" అని అందరు కొనియాడుతారు.



**చందాలు రెనూవ్వల్ చేయండి !**
**క్రొత్త చందాదారులను చేర్పించండి !!**

# నటరాజశేఖర డి.వి. సుబ్బారావు

నటవిటగాయకులు, పంక్తి బాహ్యులు, నీతి బాహ్యులు అని అనుకునే శుద్ధ చాందస సనాతనపు రోజుల్లో ఎంతో ధీమాగా రంగస్థల ప్రవేశం చేసి అభినయకళనే పూజ్యమైనదిగా గ్రహించి, వ్యక్తిగా స్వీకరించి జీవిత పరమావధిగా ఎంచుకుని నిరంతర సాధనానిమగ్నుడై, అద్వితీయచాతురీ విన్యాసవైఖరీ విలాసాలతో విభిన్న భూమికలను ధరించి పోషించిన శ్రీ డి.వి. సుబ్బారావుగారు ఆంధ్ర నాటక రంగంలో నాల్గు దశాబ్దాలు మహానటులుగా వెలుగొందారు.

సుబ్బారావుగారు నాటకరంగంలో మూడు మూర్తుల్లో ప్రత్యక్షమవుతారు. ప్రజ్ఞాప్రాభవాలుగల మహానటులుగా, దీక్షాదక్షతలుగల నాటక సమాజాధినేతగా, నీతి నియమాలు గల మహనీయునిగా వారికి వారేసాటి. అందుకనే నిర్దిష్ఠ కళామూర్తిగా, అనుపమాన వ్యక్తిగా అశేషాంధ్రావళి హృదయకుహరాల్లో ఆదర్శమూర్తిగా శాశ్వత స్థానాన్ని పొందగలిగారు.

ఆయన 1893వ సంవత్సరం జూలై 15వ తేదీన సర్వకళలకు కాణాచియైన బందరు పట్టణంలో ఉన్న గొడుగుపేటలో మాతామహుల ఇంట జన్మించారు. ఆయన పూర్తి నామధేయం "దేవరకొండ వేంకట సుబ్బారావు". కానీ డి.వి. సుబ్బారావనే వ్యవహార నామానికే ఎక్కువ ప్రచారం, ప్రాముఖ్యం, ప్రాధాన్యత, ప్రఖ్యాతి కలదు. వారి పేరు ప్రతిష్ఠలు ఆంధ్ర దేశం నలుమూలలకీ వ్యాప్తిచెందాయి అంటే వారి వ్యక్తి విశేషం, అభినయ విశేషం ఎంత మహత్తును సంతరించుకున్నదో వెల్లడౌతుంది.

వారి పితృపితామహస్థానం బందరు సమీపాన ఉన్న గూడూరు గ్రామం. వారు పుట్టింది బందరులోనైనా బాల్యవ్యవస్థను గడిపింది గూడూరు గ్రామంలోనే. తండ్రి గంగయ్యగారు. తల్లి వర్ధనమ్మగారు. వైదీక బ్రాహ్మణులు.

పూర్వీకులు నైజాం పరగణానుండి గోల్కొండ నవాబుల కాలంలో బందరు దగ్గరలో ఉన్న గూడూరు గ్రామానికి తరలి వచ్చారు. వారిలో కొందరు వీధినాటకాలను ప్రదర్శించేవారు. అదీగాక సుబ్బారావు గారికి నల్గురు పెత్తండ్రులు ఉండేవారు. వారిలో ఇద్దరు మాత్రం సంగీతం నేర్చుకోవడానికీ, వేదం నేర్చుకోవడానికి అప్పట్లో కాశీ పట్నానికి వెళ్ళారు. మిగతా ఇద్దరూ సుబ్బారావుగారి తండ్రిగారి గ్రామంలోనే ఉండి వైదీక వృత్తి చేస్తుండేవారు. సుబ్బారావుగారిది నిరుపేద వంశం. తండ్రిగారు పురోహిత జీవనులైనా కళాసక్తిపరులు. వీధినాటకాల్లో హంగుదారులుగా ఉండి చిందులువేసేవారు. సంగీతం పాడేవారు. వేదం వల్లిస్తుండేవారు. తండ్రిగారి ద్వారా చిన్నతనంలోనే సుబ్బారావుగారు పాటలు, పద్యాలు, రాగాలు నేర్చారు. కొంత అభినయక్రమాన్ని తెల్సుకున్నారు.

## డి. వి. బి. నటరాజశేఖర్

సంసార బాధలు, ఆర్థిక బాధలు తట్టుకోలేక తండ్రిగారు సుబ్బారావుగార్ని చదువు నిమిత్తం బాపట్ల పంపగా, అక్కడ వారు పెద్దబావగారి వద్ద ఉండి చదువుకుని 7వ తరగతి పరీక్షలో ఉత్తీర్ణులైనారు. తర్వాత స్వగ్రామానికి వచ్చి బందరు నోబుల్ హైస్కూల్లో చదివి తీరా పరీక్షలు వ్రాయవచ్చేప్పటికి బందరులో కలరా వ్యాధి ప్రబలిందని తెల్సుకుని పరీక్షలకు వెళ్ళక చదువుకు స్వస్తి చెప్పారు.

బావట్లలో ఉండగానే వారు బ్రహ్మసమాజమతాన్ని స్వీకరించారు. బ్రహ్మ సమాజ మందిరంలో వారంవారం జరిగే ప్రార్థనల్లో విశేషంగా పాల్గొని బ్రహ్మమత కీర్తనలను శ్రావ్యంగా పాడేవారు. అక్కడ ఉండగానే బంధువుల ద్వారా 'నటపితామహ' హరి ప్రసాదరావుగారి అభినయ వైదుష్యాన్ని గూర్చి విని, తెల్సుకుని ఆ దివ్యమూర్తిని సాక్షాత్తూ నటరాజేశ్వరునిగా భావించి తమ హృదయంలో నిలుపుకుని సదాస్మరిస్తూ ఆరాధించ మొదలిడినారు.

గూడూరు గ్రామంలో ఐదు పెద్ద దేవాలయాలు ఉండేవి. ఈ అయిదు దేవాలయాల్లోనూ ప్రతి ఏటా ఏడాది పొడుగునా ఏ స్వామికో, ఏఅమ్మవారికో వైభవోపేతంగా ఉత్సవవేడుకలు జరిగేవి. ఆ ఉత్సవాల్లో తోలుబొమ్మ

లాటలు, వీధి నాటకాలు, సాముగారడీలు, కూచిపూడి భాగవతాలు, భోగం మేళాలు ప్రదర్శింపబడేవి. చిన్నతనంలో ఉన్న సుబ్బారావుగారు తండ్రిగారితో పాటు ఆ ప్రదర్శనలకు హాజరై, రాత్రి తెల్లవార్లూ మేల్కొని చూచి ఆనందించేవారు.

ప్రదర్శనలను చూచిన మర్నాడే తోటి బాలురను కలుసుకుని గూడూరు గ్రామదిబ్బల మీద హిరణ్యకశిపుడుగానో, ప్రహ్లాదుడుగానో వేషం ధరించి, ఏవేవో మాటలతో, పద్యాలతో, పాటలతో, భావ ప్రకటనలతో, భంగిమలతో, నడకలతో ప్రదర్శనలను ఇచ్చి దారినపోయే వారిని ఆకట్టుకుని ఆశ్చర్యపరచేవారు. ఇదంతా రమణయ్య పంతులుగారనే ఒక మంచి వ్యక్తి చూచి, "చిన్నవాడివైనా భలే బాగా చేస్తున్నావురా అబ్బాయీ! నాటక కంపెనీలో వేషం యిస్తాను. నాతో వస్తావురా" అని అనగానే తల్లికి, తండ్రికి చెప్పకుండా ఆవ్యక్తితో బందరు వచ్చారు. ఆ రమణయ్య పంతులుగారి చలువ వల్ల బందరు భువనరంజనీ థియేటర్‌లో ప్రవేశించారు. ఓం ప్రథమంగా మంజువాణి అనే చెలికత్తె వేషంతో 14 ఏళ్ళ ప్రాయంలో (1908 సంవత్సరం) రంగస్థలంలో ప్రవేశించేవారు. ఆ వేషధారణయే ఆయన నటనా వివేకము, జీవన విధానానికి దైవం పల్కిన నాంది. ఈ థియేటర్‌లోనే చంద్రకాంత నాటకంలో పార్వతిగా, చిన్న చంద్రకాంతుడుగా పుత్ర విజయం నాటకంలో పురుష వేషాన్నీ, కుశలవ (విష్ణుభట్ల) నాటకంలో కుశుడుగా, సీతగా, లంకాదహనం నాటకంలో సీతగా, అక్షయుడుగా, చారుమతీ నందివర్ధనీయం నాటకంలో చారుమతిగా, ప్రసన్నయాదవం నాటకంలో మణిభద్రుడుగా, భరతుడుగా, కృష్ణుడుగా నటించి అభినయానుభవాన్ని గడించారు. ఆ రోజుల్లో వారికి ఇచ్చిన నెలవేతనం నాల్గురూపాయలు. జీతం పెంచమని యాజమాన్యాన్ని కోరగావారు ససేమీరా పెంచమన్నారు. దానితో అభిమానధనుడైన సుబ్బారావు గారు ఆ థియేటర్ నుండి తప్పుకున్నారు.

బందరులో ఒక సంపన్నుడైన వకీలు గారికి గుమాస్తా కావాల్సివచ్చింది. ఆ పనికి సుబ్బారావుగారు ఒప్పుకుని ఆయన్ను కలిశారు. ఇదిగో, అదిగో అని సుబ్బారావుగార్ని త్రిప్పి, త్రిప్పి చివరికి "ఏరా అబ్బాయి! నువ్వేమో నాటకాల్లో ఆడవేషాలు వేస్తావుట. మా ఇంట్లో ఆడపిల్లలున్నారు మరి. చూస్తూ చూస్తూ నిన్నెట్లా గుమాస్తాగా పెట్టుకునేది" అని చెప్పి పంపేశారు. ఆ మాటల్లో అంతరార్థం అన్న ఆ మహానుభావునికే తెలుసు. అయినా వకీలు గుమాస్తాగానే సుబ్బారావుగారు ఉండిపోవలసివస్తే తెలుగునాటకరంగ సరస్వతీ వికాసానికి తీరని లోటు కలిగేదేమో ! కానీ ఈవిధంగా జరుగక దైవబలం వల్ల, జాతక బలం వల్ల తిరిగి వారు నటజీవితాన్ని కొనసాగించడానికి నాటక రంగప్రవేశం చేశారు.

1910వ సంవత్సరం సెప్టెంబర్ 12వ తేదీన "ది ఇండియన్ డ్రమేటిక్ కంపెనీ"ని నల్లూరి బ్రహ్మానంద నాయుడు గారనే ఆయన బందరులో స్థాపించారు. ఎప్పుడైతే సుబ్బారావుగారు భువనరంజనీ థియేటర్ నుంచి వైదొలగారో అప్పట్నించే బ్రహ్మానందం గారు నాటక కంపెనీ పెట్టి నడపాలనే తాపత్రయంతో సుబ్బారావుగార్ని వెంటనిడుకుని తిరుగుతూండేవారు. సుబ్బారావుగారంటే వారికి పంచప్రాణాలు. ఏ త్యాగమైనా చేయడానికి సిద్ధపడేవారు. తన చెవులకున్న ఎఱ్ఱ రాళ్ళ దుద్దులను తీసి మెరుగు పెట్టించి తెచ్చి సుబ్బారావుగారి చెవులకు అలంకరించారంటేనే తెలుస్తోంది వారి యొక్క ప్రేమతత్వం. ఆనాడు ఎఱ్ఱరాళ్ళ దుద్దులంటే జనానికి ఎంతో మోజు. ది ఇండియన్ డ్రమేటిక్ కంపెనీలో సుబ్బారావుగారు 1910లో చేరి చివరిదాకా అంటే 1946 వరకు ఆ కంపెనీనే అంటిపెట్టుకుని తానుపైకి వచ్చి దాన్ని కూడా పైకి తెచ్చారు. గుళేబకావళిలో జయద్రధుడుగా, సుగుణమణిలో సుగుణమణిగా, గయోపాఖ్యానంలో అర్జునుడుగా, రంగరాయదన సమావాకారంలో విజయ రామరాజుగా, చెలికాని వెంకయ్యగా, గోపీ చంద్‌లో గోపీచంద్‌గా, బుద్ధిమతీ విలాసంలో బుద్ధిమతిగా, ప్రచండ చాణక్యంలో నందుడుగా, సాత్రాజితేయంలో కృష్ణుడుగా, శ్రీకృష్ణ తులాభారంలో కృష్ణుడుగా, వీరసంయుక్తలో పృథ్వీరాజుగా, లవకుశ (బళ్ళారి)లో రాముడుగా, లక్ష్మణుడుగా, కృష్ణలీలలో యశోదగా, వసుదేవుడుగా, కంసుడుగా, చంద్రహాసలో దుష్టబుద్ధిగా, రసపుత్ర విజయంలో దుర్యోధనునిగా, చిత్రనళీయంలో నలుడుగా, బాహుకుడుగా, సత్యహరిశ్చంద్రీయంలో హరిశ్చంద్రుడుగా, చంద్రమతిగా, శ్రీకృష్ణ నిర్యాణంలో అర్జునుడుగా, వేణీ సంహారంలో కర్ణుడుగా, విడుక్తావళిలో సోమశేఖరుడుగా, ఫాల్ ఆఫ్ విజయనగర్‌లో పఠాన్‌గా, మేవాడు పతనంలో గోవింద సింగ్‌గా, ప్రతిజ్ఞా చాణక్యంలో చాణక్యుడుగా, సతీసావిత్రిలో సత్యవంతుడుగా, సారంగధర (విష్ణుభట్ల)లో సారంగధరుడుగా, సారంగధర (బళ్ళారి)లో రాజరాజ

నరేంద్రుడుగా, బుద్ధిసాగర విజయంలో బుద్ధి సాగరుడుగా నారాజులో విశ్వపతిగా, తిమ్మరుసుగా, చింతామణిలో భవానీ శంకరులుగా, వింధ్యరాణిలో వింధ్యరాజుగా, ప్రహ్లాదలో హిరణ్యకశిపుడుగా, కనకధారలో కనకసేమునిగా, మదన విజయంలో మదనుడుగా వసంతసేనలో శకారునిగా, మరో ప్రపంచం (సాంఘికం)లో రాజశేఖరునిగా ఇట్లా విభిన్న నాటక ప్రదర్శనాల్లో విభిన్న భూమికలను నిర్వహించి విభిన్న భూమికా నిర్వహణాలధౌతేయులైనారు.

ది ఇండియన్ డ్రమేటిక్ కంపెనీలో ప్రవేశించిన తర్వాత శ్రీ బుక్కపట్నం తిరుమల రాఘవాచారి (బి.టి. రాఘవాచారి లేక అడ్డ తలాచారి అనేది వారి వాడుక నామధేయం) గారి వద్ద అభినయ విధానాన్ని అభ్యసించారు. ఆచారిగారు సుబ్బారావుగార్ని అన్ని విధాలా తీర్చిదిద్ది, ఉత్తేజపరచి అభినయ పాఠాల్నీ, రహస్యాన్నీ నేర్పారు.

చిత్రనళీయ నాటకాన్ని శ్రీ ధర్మవరం రామకృష్ణమాచార్యులు గారి వద్ద నుండే స్వయంగా పొంది, వారి మ్రోల తమ నటనను,గానాన్ని ప్రదర్శించి ఆ ఆంధ్ర నాటక పితామహుని ఆశీస్సులనందుకున్నారు సుబ్బారావు గారు. ఇది అదృష్ట విషయమే కదా !

బందరులో 1916వ సంవత్సరం జనవరిలో చిత్రనళీయ నాటక పోటీలు జరిగినపుడు ది ఇండియన్ డ్రమేటిక్ కంపెనీ ద్వారా ఆ పోటీల్లోవారు పాల్గొని నలబాహుక పాత్రల్ని నటించి, వారి సమిష్టి కృషికిగాను వెండి సరస్వతీ విగ్రహాన్ని గెల్చుకున్నారు. ఇంకొక విశేషమేమిటంటే 1917వ సంవత్సరం ఫిబ్రవరిలో ఆంధ్ర సాహిత్య పరిషత్‌వారు గుంటూరులో నిర్వహించిన సత్యహరిశ్చంద్రీయం నాటక పోటీల్లో సుబ్బారావుగారు ఉత్తమ హరిశ్చంద్ర భూమికగా ఎంపికై 'నట పితామహ' హరి ప్రసాదరావుగారి స్వహస్తాల మీదుగా సువర్ణ పతకాన్ని బహుమతిగా స్వీకరించి వారి ఆశీస్సులను పొందారు. ఆనాటి నుండి హరిప్రసాదరాయులకు హరిశ్చంద్ర పాత్రధారణ విషయంలో వారసులైనారు.

సుబ్బారావుగారి పద్యపఠనావైఖరి, ఆంధ్రనాటక రంగం మీద ఒక గొప్ప ఆకర్షణని కలిగించిందనే చెప్పాలి. వారిది రాగసమన్వితమైన, రసభావస్ఫురితమైన పద్యపఠనా విధానం. పద్యం అంటుంటే పదబంధం ఎక్కడికక్కడికే విడివడేది. అర్థస్ఫూర్తికలిసేది. శ్రావ్యంగా, గంభీరంగా ఉండేది. సంగీతం విశృంఖలంగా పాడ కలిగేవారైనా, వారు మాత్రం పద్యగడభావ ప్రకటనా సౌలభ్యం కోసమే అనువుగా దాన్ని వాడారు. అందువల్ల సంగీతం అభినయంలో పద్యంలో కలిసిపోయి వినేవారికి హాయిని కలిగించేది. నటుడు సర్వాంగ సుందరుడుగా ఉండాలనేది లాక్షణికుల నిబంధన. ఈనిబంధన విషయం ఎలా ఉన్నా అద్భుతమైన నటనాకౌశలం, చక్కని సంగీత నైపుణ్యం, శ్రోతపేయమగు గానమాధుర్యం, భావ ప్రకటనకు అనువైన పద్యపఠనాశక్తి, నిండైన విగ్రహం, ఠీవి, విశాల నేత్రాలు, గిరజాల జుట్టు మున్నగు లక్షణాలన్నీ వీరిలో మూర్తీభవించిన కారణాన వీరు ఉత్తమ జాతి నటులుగా విఖ్యాతులైనారు.

నాటక ప్రదర్శనాల్ని కట్టుగా, సమిష్టిగా ప్రదర్శించిన దిట్ట. సమాజాన్ని దీక్షా దక్షతలతో ముప్పది ఆరు సంవత్సరాల కాలం అవిచ్ఛిన్నంగా, నిరాటంకంగా నడిపిన ప్రజ్ఞాశాలి. ఆయన కూడా కాలానికి కట్టుబడి నాటకాలను కాంట్రాక్టుకు ఇచ్చారు. అయితే మాత్రం తన స్వంత సమాజంతోనే ఎన్నో ప్రదర్శనాలను రసవత్తరంగా ఇచ్చారు. కాంట్రాక్టర్లు ఎన్ని డబ్బులు కుమ్మరిస్తామన్నా, ఎటువంటి ఆశలు పెట్టినా, తన నట సంఘాన్ని వదలలేదు. తన క్రమశిక్షణను, నాటక శిక్షణను, తన నియమాలను వదలలేదు. సమిష్టి ప్రయత్నంవల్ల నాటక ప్రదర్శనాలు విజయవంతం అవుతాయని నిరూపించారు. ఏనాడు, ఎచ్చటా తానుగాని, తన నట బృందంగాని అభాసుపాలు కాలేదు. నెలకి నాల్గంటే నాలుగు నాటక ప్రదర్శనాలను కాంట్రాక్టుకు ఇచ్చారు. డబ్బు కక్కుర్తి ఎరుగని వ్యక్తి. తాను ఇంకొకరి సమాజంలో వేషం కట్టలేదు. ఇంకొక సమాజం నటుడ్ని తమ సమాజంలో వేషం కట్టనీయలేదు. మహానటుడైన హరి ప్రసాదరావుగార్ని, మల్లాది గోవింద శాస్త్రిగార్ని గౌరవ భావంతో తమ కంపెనీకి రప్పించి వారి సరసన తాము నటించి వారల ఆశీస్సులనందుకుని ధన్యులైనారు. వారికి తక్క వేరొక మహానటుడికి స్థానం ఇవ్వలేదు. స్త్రీ వేషాలను పురుషుల చేతనే ధరింపచేశారు. తన పాత్రధారణ మాత్రమే కాక మొత్తం నాటకాన్ని రక్తి కట్టించగల సామర్థ్యం వారికి ఉంది. తన పాత్ర ద్వారా తన దర్జాను మాత్రమే వెలిగించుకోక తక్కిన నటులకు కూడా కావాల్సినంత అభినయావకాశాన్ని కలిపించడం వారిలోని విశిష్ట లక్షణం.

సంగీత సాహిత్యాలకీ, నాట్యాభినయాలకీ, చిత్ర రచనా శిల్పాలకీ ఆటపట్టు వారి సమాజం. శ్రీ పింగళి

నాగేంద్రరావుగార్ని తమ కంపెనీకి కార్యదర్శిగా నియమించి వారిచేత నారాజు, వింధ్యరాణి, మరో ప్రపంచం (సాంఘికం) మున్నగు క్రొత్త నాటకాలను వ్రాయించి వాడవాడలా ఆ నాటకాలను అద్భుతంగా ప్రదర్శించారు. కూచిపూడి నాట్య విద్యా ప్రవీణులైన శ్రీ వేదాంతం లక్ష్మీ నారాయణ శాస్త్రిగారి వద్ద తాము అభినయ విధానాలను తెల్సుకుని తమ సమాజంలో సభ్యులకు కొందరికి నాట్య శిక్షణనిప్పించారు. శ్రీ తోట వేంకటేశ్వరరావు వంటి చక్కటి చిత్రకారునికి తమ సంస్థలో స్థానం కల్పించి ఆతనిచేత స్త్రీ వేషాలను అత్యద్భుతంగా ప్రదర్శింపచేశారు.

గయోపాఖ్యానంలో అర్జునుడుగా నటించి 'కడచునే యెన్నడైన' 'గజ్జెలందియలు ఘల్లు ఘల్లని మ్రోయ' అన్న పద్యాలను తమ అభినయ వ్యాఖ్యాన దీధీశులతో ధగధగలాడించి నవనట సాధకులకు మార్గ దర్శకులైనారు.

పాండవ విజయం నాటకంలో సుబ్బారావుగారి శ్రీ కృష్ణ భూమిక ప్రత్యేక ప్రశంసాపాత్రమైంది. మొదటి రంగంలో భీష్ముని ప్రవాపోగ్రనిలయాన్ని చెలరేగ, ఆ ధాటికి ఆగలేక చక్రాన్ని చేతదాల్చి అర్జునుని రథంమీద నుంచి భూమి మీదకే లంఫించి వీరావేశంతో భీష్మునిపైకి "వృద్ధుండౌ నలజామడన్నుడనుకుంటే" అన్న పద్యాన్ని శ్రీకృష్ణ వేషధారిగా రసావేశంగా పఠిస్తూ దండెత్తి వచ్చేవారు సుబ్బారావుగారు. అట్లా ప్రవేశంలోనే లంఫించడం మూలాన భీష్ముడ్ని నిజంగా చంపేస్తాడేమోనన్నంతగా భయవిభ్రాంతులయ్యేవారు ప్రేక్షకులు.

రసపుత్ర విజయంలో యోగివేషరూపంలో దుర్గాదాసుయొక్క సాహసకృత్యాలను మహా ఉదాత్తంగా ప్రదర్శించి రాజపుత్ర లక్షణాలను బాగుగా ప్రస్ఫుటం చేశారు. ఆయన అభినయ విధానానికి దుర్గాదాసు పాత్ర గీటురాయి.

చిత్రనళీయంలో వారు నలబాహుక భూమికల్ని నిర్వహించారు. నలుని వేషంలో "అదిరా ఇందుల మేలు బంతి" అనే పద్యాన్ని భావోద్వేగంతో, రసోద్వేగంతో, శృంగార చేష్టాతన్మయత్వంతో పఠిస్తూ ప్రేక్షకుల హృదయాలను గిలిగింతలు పెట్టేవారు. సర్పదష్టుడైన నలుడు వికారరూపాన్ని పొంది బాహుకుడౌతాడు. నన్నయభట్టారకుని వర్ణనాన్ననుసరించి సుబ్బారావుగారు సగము వంగి, పొట్టి చేతులతో, వంకరైన శరీరంతో, నిరర్థకుడై, మన్మథ బాధనొందుచున్న బాహుకుడుగానే రంగస్థలంమీద కన్పించారు. నక్షత్రమాల పద్యాలనువారు ఎంతో హృద్యంగా పఠించగా రశిక్తాలు 'హాయి హాయి' అని ఊగులాడాయి. ఇరువది ఏడు పద్యాలకి ఇరువది ఏడు రాగాలను మేళవించి భావస్ఫురణ గోచరంగా చదివారు.

సత్యహరిశ్చంద్రీయ నాటకం ఎవరైనా ఎక్కడైనా ప్రదర్శిస్తున్నారంటే చటుక్కున్న అందరి స్మృతి పథాన మెదిలేది సుబ్బారావుగారి విశిష్టమూర్తియే. వారి హరిశ్చంద్ర భూమికా నిర్వహణలో ప్రజ్ఞ ఉపజ్ఞలు మేళవించ బడ్డాయి. కాబట్టి ఆ ధీరోదాత్తునికి, ఆ సత్యవ్రతునికి విశిష్టమైన గానాభినయ రూపకల్పన జరిగింది. హరిశ్చంద్ర పాత్రాభినయంలో ఆ మహామహుని మహోదార సత్యశీలత సుబ్బారావుగారిలో కనబడేది. 'దేవ బ్రాహ్మణ మాన్యముల్ విడచి' అనే పద్యాన్ని పఠిస్తూ రాజ్యాన్నంతటినీ విశ్వామిత్రునికి ధారపోసేడప్పుడు విశ్వప్రవిధాతయైన కౌశికుని కరంబు క్రిందగుట, మీదై నా కరంబుంట మేల్గాదే రాజ్యము గీజ్యమున్ సతతమే కాయంబు నాపాయమే' అను భావాన్ని వెల్లడించి దాతకు సత్పాత్రము లభించిన ఆనందాన్ని ప్రకటించారు. సిరిసంపదలు అస్థిరములు - కింకరుకే రాజగు రాజేకింకరుడగుననే హెచ్చరికను తమ మధురవాణి ద్వారా ప్రసారం చేసి మానవజీవితంలో క్రింది మీదులు ఉంటాయని అభినయం ద్వారా వెలిబుచ్చారు. అడవుల్లో తిరుగాడునపుడు భార్యాబిడ్డలకు సహాయ పడలేని దైన్యస్థితిని చూపాల్సి వచ్చినప్పుడు మానసిక వేదన, కాశీఘట్టంలో సత్యవ్రతరక్షణార్థం భార్యాబిడ్డల్ని తెగనమ్ము కోవాల్సినప్పుడు చూపిన నిర్లిప్తత, కాటికాపరిగా విధ్యుక్త ధర్మాన్ని నిర్వహించడంలో చూపిన విధేయత అధిక ప్రేక్షకుల నామోదాన్ని పొందారు.

శ్మశాన వాటిక దృశ్యంలో ఆయనకనపరచిన నటన మరువలేనిది. మరపురానిది. హరిశ్చంద్రుని సత్యనిష్ఠాగరిష్టత, అచంచలిత దీక్ష, అకుంఠిత నిశ్చయం ఆ దృశ్యంలో ప్రస్ఫుటంగా ప్రకటితమయ్యేవి. సత్యదీక్షకై చంచల శ్రీ సుఖాలను బాసి నిశ్చలయశస్సునే కాంక్షించి, కోరి, కడకు అతినీచమైన చండాలదాస్యానికి ఒప్పుకున్న తరుణంలో, తన విషాదస్థితిని, వైరాగ్యభావాలను తన నటనా చాతుర్యంతో, సంభాషణా వైవిధ్యంతో, పద్యపఠనా సామర్థ్యంతో ప్రకటితంచేసి ప్రేక్షక హృదయాలను దుఃఖావేశ పూరితంగావించారు. ఎందరెందరో ప్రేక్షక

మహాశయులు ద్రవీభూతులై కన్నీరు మున్నీరు కార్చారు. చిత్ర విచిత్రమైన ముఖకవళికలు కంఠస్వరగ్గదికాలు, విషాదచ్ఛాయలు ఆయనలో సిద్ధించాయి. ముఖ్యంగా ''మయామేయజగంబె'' ''ఈయలివేణినోట'' "దళమాపయ్యేదలో" "పడతీఎవ్వతెవీవు" "హృదయమా" అనుపద్యాలను చదివేటప్పుడు సంభవించిన ఆ పద్యగమన ఊపులకు రశికాత్మలు పరవశించి "భేష్" అన్నాయి. శ్రోతులు, రావిచుండెలు సైతం కదలి కన్నీరు కార్చాయి. ఒక్కసారి శోకాంబుధిలో మునిగితేలాయి. సుబ్బారావు గారిది శారీరకంగా ఒక ప్రత్యేక విన్యాసం. మానసికంగా విషాద భావ ప్రకటన. ఆ శోకగాధకు సరిపడ్డ తూకమైన నటన వారికే వశమైంది. వారిద్వారా హరిశ్చంద్ర నాటకానికి, హరిశ్చంద్ర నాటకం ద్వారా వారికి ప్రఖ్యాతి కల్గిందని చెప్పడం లోక సమ్మతి సంస్థుతి వాక్యం. తింటే గారెలు తినాలి. వింటే భారతం వినాలి. చూస్తే డి.వి. సుబ్బారావుగారి హరిశ్చంద్ర పాత్రాభినయాన్నే చూడాలి అనేది బహుజన వాక్యం - కాదు ప్రశంసావాక్యం.

విజ్ఞాన మణిమంత నాటకం (చంద్రహాస)లో దుష్టవృద్ధ మంత్రి పాత్ర అయిన హుంధీనసూదుగా రంగం మీదకు అవతరించేవారు సుబ్బారావుగారు. ఆ పాత్ర కపటకృత్యక పటాభినయాలకి మూలం. సుబ్బారావుగారు ఒక్కొక్కచోట అభినయాన్ని ద్వివిధాలుగా ప్రదర్శించారు. చంద్రహాసుని ముఖతః ప్రేమ, ఔదార్యం పరోక్షంగా క్రౌర్యం, ద్వేషం, కక్ష వ్యక్తం చేసేవారు. కరుణయనే పదార్థమెరుగని కరడుకట్టిన పరమ దుర్మార్గుడుగా నటించి వాసికెక్కారు.

విజయనగరం సామ్రాజ్య పతనం (ఫాల్ ఆఫ్ విజయ నగర్) నాటకంలోసుబ్బారావుగారు పఠాణి పాత్రను పోషించేవారు. ఆయన రూపంలో కొంచెం పొట్టి వారైనా పఠాను వేష రచనలో వారిదే విశిష్టత. ఎందుకంటే వారు ఉత్తర హిందూస్థానానికి చెందిన అచ్చమైన పఠాణిగా రంగస్థలం మీద కన్పించేవారు. పఠాణికి ఉండే నైజు గుణాలన్నిటిని అతి శ్రద్ధతో విమర్శించి చక్కగా అభ్యసించారు. మొదటి నుంచి ఎవరి వరకు ఆ పాత్రను అతి సహజంగా ప్రదర్శించారు. మరీ పఠాణీకి భావ సంక్షోభం కలిగినప్పుడు, ఆషాబిమానభంగ సమయంలోను, నాటకాంతపు ఉన్మాదంలోను వీరు ఆ నాటకానికి చేసిన రూప వ్యాఖ్యానం మిక్కిలి జాగరూకతతో రసజ్ఞతతో విశేషాభ్యాసంతో జగత్ప్రవనీయంగా చేశారు. చక్కని రాగాలాపనా విధానంతో కదంత్రొక్కే ధోరణిలో వారు ప్రతి పద్యాన్ని పఠించి ఈ పాత్రను జనరంజకం చేశారు.

సుబ్బారావుగారి విశిష్టమైన నటజీవితంలో ఎన్నో అమృత ఘట్టాలు ఉన్నాయి. అవన్నీ ఏకరువు పెడితే విస్తృతమౌతుంది విషయం. అందువల్ల ముఖ్యమైనవి మాత్రమే చెప్పాల్సి వస్తోంది. ఎన్నో బహుమతుల్ని సన్మానాల్ని వారు పొందారు.

1923వ సంవత్సరంలో వారు బందరు పౌరుల నటరాజుగా ప్రశంసలనందుకున్నారు. 1941వ సంవత్సరంలో మద్రాసులో జరుపబడిన ఆంధ్రనాటక కళాపరిషత్ పదకొండవ వార్షిక మహాసభలకు వారు అధ్యక్షత వహించారు. 1941 నుండి 1944 వ సంవత్సరం వరకు వారే పరిషత్ అధ్యక్షులు. 1943వ సంవత్సరంలో బందరులో వారికి మకుటాయమానమైన సన్మానం జరిగింది. అప్పుడు వారిని గజారోహణం గావించి, 'నాట్య కళాప్రపూర్ణ' బళ్ళారి రాఘవాచార్యులవారిచేత "నట రాజశేఖర' బిరుద ప్రదానాన్ని జరిపించి గౌరవించడమైంది. 1946లో చిత్రరంగ ప్రవేశం చేసి వింధ్యరాణి సినిమాలో వింధ్యరాజుగా నటించారు. 1951లో బందరు ఆంధ్ర నాటక కళాపరిషత్ శాఖకు అధ్యక్షులైనారు. 1957లో గుంటూరులో పౌర సన్మానాన్ని పొందారు.

ఆయన ఆంధ్ర నాటక రంగం స్వర్ణ యుగంలోకి ప్రవేశిస్తుండగానే రంగస్థల ప్రవేశం చేసి బాలనటులుగా, నటులుగా, ఉత్తమ నటులుగా, మహా నటులుగా, ప్రయోక్తలుగా, గొప్ప దేశికులుగా, ఉపదేశికులుగా, అధినేతలుగా, న్యాయనిర్ణేతలుగా పలువిధాల నాటక రంగానికి విశిష్టమైన సేవ చేసి దాని అభ్యున్నతికి అహరహం పాటుబడి నటరాజశేఖరులుగా చిరస్థాయి కీర్తి వ్యాప్తితో 1960 జనవరి 7వ తేదీన ఆ నటరాజ స్వామిలో ఐక్యమైనారు. ✸

ఎందరో మహానుభావులు - 11

# శ్రీపాదశ్రీ వల్లభులు

చరిత్రకు తెలిసినంతవరకు దత్తాత్రేయుని అవతార పరంపరలో మొదటి అవతారం శ్రీపాదశ్రీ వల్లభులు. ఈయన తెలుగువాడు కావటం మనం చేసికొన్న పుణ్యం.

పధ్నాలుగవ శతాబ్దంలో పిఠాపురంలో రాజశర్మ, సుమతి దంపతులకు మూడవ సంతానంగా ఈయన జన్మించాడు. ఒకసారి రాజశర్మ యింట శ్రాద్ధం జరగనున్నది. శర్మగారు భోక్తలను పిలుచుకొని రావటానికి పోయారు. అప్పుడొక వృద్ధ బ్రాహ్మణుడు వచ్చి భిక్ష అడిగాడు. " అతిధి దేవోభవ !" అన్న వాక్యాన్ని స్మరించి సుమతి తద్దినపు వంటను ఆయనకు వడ్డించింది. ఆయన భోజనం చేసి తృప్తిపడి ' అమ్మా ! నీవేదైనా కోరిక కోరు !' అనడిగాడు. ఆమె 'స్వామీ ! నాకు మొదటి కొడుకు కుంటి. రెండవవాడు గ్రుడ్డి. అందువల్ల ఎంతో దుఃఖ పడుతున్నాము' అన్నది. అప్పుడాయన 'నీకు ఇంకో కుమారుడు పుడతాడు. వంశాన్నంతటినీ పావనం చేస్తాడు. అయితే, అతని మాట మీరు వినాల్సిందే కాని మీ మాట అతడు వినడు' అని చెప్పి వెళ్ళాడట! ఆ తరువాత సుమతికి భాద్రపద శుద్ధ చవితినాడు ఒక చక్కని మగ పిల్లవాడు కలిగాడు. ఆ పిల్లవాని అరికాళ్ళలో శంఖచక్రాది శుభ లక్షణాలున్నాయి. కనుక అతడికి శ్రీపాదుడు అని పేరుపెట్టారు.

శ్రీపాదుడు చిన్నతనంలోనే వేదవేదాంగాలలో దిట్ట అనిపించుకున్నాడు. అప్పుడు తల్లిదండ్రులతనికి పెండ్లి చేయ సంకల్పించారు. అప్పుడు శ్రీపాదుడు నవ్వి, "నేను వరించింది యోగలక్ష్మిని. అందుకే నేను శ్రీ వల్లభుడను" అంటూ తాను కొద్దిరోజులలో ఇల్లు విడిచి తత్త్వ ప్రచారానికి పోబోతున్నట్లు తల్లికి చెప్పాడు. ఆమె దానికి ఎంతో దుఃఖిస్తే ఆయన ఆమెకు తత్త్వజ్ఞానాన్ని ఉపదేశించాడు. తన అన్నలిద్దరినీ పిలిచి వారివంక చూశాడు. ఆ చూపుతో వారికి గల అవలక్షణాలు పోయాయి. ఇద్దరూ ఏ వంకాలేనివారై పూర్ణాయురారోగ్య వంతులవుతారని ఆయన దీవించాడు. ఆ విధంగా తన తల్లిదండ్రులను సంతోషపెట్టి ఆయన ఇల్లు వదలి వెళ్ళారు.

శ్రీపాదశ్రీవల్లభులు కాశీ, బదరీ, కేదారం, గోకర్ణం, శ్రీశైలం మొదలైన క్షేత్రాలు దర్శించారు. రాయచూరుకు 20 కి.మీ. దూరంలో గల కురుగడ్డ (కృష్ణా నదిలోని ఒక దీవి) చేరుకొని అక్కడ నివసించారు. ఆయన అనేక మహిమలు, లీలలు ప్రదర్శించారు. చివరకు ఒక ఏడు ఆశ్వయుజ ద్వాదశినాడు ఆయన కృష్ణ నీటిపై పద్మాసనం వేసికొని కూర్చొని భక్తులంతా చూస్తుండగా అదృశ్యమయ్యాడు. దత్తాత్రేయ సంప్రదాయాన్ని అనుసరించేవారికి కురుగడ్డ గొప్ప యాత్రా స్థలంగా మారింది.

శ్రీపాద శ్రీవల్లభులు చెప్పిన ప్రకారం కరంజ పురంలో అంబా మాధవులనే దంపతులకు నరహరి అని ఒక పిల్లవాడు కలిగాడు. ఆయనే దత్తావతారంగా ప్రసిద్ధి గాంచిన నృసింహసరస్వతి. దత్తావతారాల చరిత్రలు 'గురుచరిత్ర' అన్న గ్రంథంలో లభిస్తాయి. ఈ గ్రంథం కర్నాటక, మహారాష్ట్రలలో పారాయణ గ్రంథంగా ప్రచారం పొందింది. తెలుగునాట కూడా ఇటీవల బాగా ప్రచారాన్ని సంపాదించుకొంది. ●

## భండారు పర్వతాలరావు

"విద్యకు, విజ్ఞానానికి వ్యత్యాసం ఉంది. విద్య ద్వారా విజ్ఞానం సంపాదించినప్పుడే ఆ విద్యకు విలువ ఉంది. జీవిత దృక్పధాన్ని, ఇతర ప్రజలతో లేక ఇతర సంఘాలతో ఉండవలసిన సంబంధాలను నిర్ణయించేదే విజ్ఞానం"

- శ్రీమతి సరోజినీనాయుడు

ఈశ్వరమ్మ వర్ధంతి

# అమృతమయమైనది తల్లిప్రేమ

తల్లి గర్భము నుండి ధనము తేడెవ్వడు
వెళ్ళి పోయెడినాడు వెంటరాదు
లక్షాధికారైనా లవణమన్నమె కాని
మెఱుఁగు బంగారంబు మ్రింగబోడు
విత్తమార్జనఁజేసి విఱ్ఱవీగుట గాని
కూడబెట్టిన సొమ్ము తోడరాదు
తుదకు దొంగల కిత్తురో ఎవరికో
తెనె జుంటీఁగలియ్యవా తెరువరులకు
శాశ్వతము ఆత్మ ఒక్కటే అరసిచూడ
ఇంతకన్ననువేరెద్ది ఎఱుక పరతు.

ప్రేమస్వరూపులారా !

ప్రాచీన కాలమునుండి ఈ పవిత్ర భారత దేశమున తల్లిని దైవముగా భావించి, ఆరాధించి, ఆనందించే సత్సంప్రదాయం ఉన్నది. వేదపారాయణ సమయమందు ప్రప్రథమంలో "మాతృదేవోభవ ! పితృ దేవోభవ ! ఆచార్య దేవోభవ !" అని ప్రార్థనలు సలుపుతారు. తల్లే దైవం. తండ్రే దైవం. ఆచార్యుడే దైవం. కాని ఈ దైవము దేనికి దైవము? ప్రాకృతమైన జీవితానికి దైవము. మానవ శరీరమునకు మాతృదేవోభవ ! పితృ దేవోభవ ! ఆచార్య దేవోభవ ! కాని జీవితమునకు దైవము సర్వస్వము.

త్వమేవ మాతా చ పితా త్వమేవ
త్వమేవ బంధుశ్చ సఖా త్వమేవ
త్వమేవ విద్యా ద్రవిణం త్వమేవ
త్వమేవ సర్వం మమదేవ ! దేవ !

పారమార్థిక జీవితమునకు ఇది ప్రధానమైన పర్వం. కాని ప్రాకృతమైన తల్లి, తండ్రి గృహనివాసులు. ఆచార్యుడు ఆశ్రమనివాసి. కాని భగవంతుడు హృదయనివాసి. హృదయంలో నివసించటానికి ఒకదైవమునకు తప్ప మరెవరికి అధికారం లేదు. తల్లి దైవమే, తండ్రి దైవమే, ఆచార్యుడు దైవమే. కాని హృదయంలో నివసించటానికి వీరికి అధికారంలేదు. వీరిని గౌరవించాలి, పూజించాలి, ఆనందపరచాలి. కాని ఆరాధనకు హృదయవాసియే అర్హుడు. అతనే శాశ్వతమైన దైవత్వము.

తల్లికంటె మిగుల దైవంబు దగ్గర
సన్నిహితుడు తండ్రికన్న చాల
ఇట్టి దైవమును వీడ అబ్బును పాపంబు
సత్యమైన మాట సాయిమాట.

ప్రాచీనకాలమందు కుమారులు ఏ యుద్ధములో విజయాన్ని సాధించాలన్నా, లేక తపస్సు చేయటానికి అరణ్యాలకు వెళ్ళేముందుగాని, తల్లికి ముందుగా నమస్కరించి, తల్లి ఆశీర్వాదమును పొంది వెళ్ళటం ఆనాటి సంప్రదాయం. ఆరు సంవత్సరముల బాలుడైన ధృవుడు తల్లి ఆశీర్వాదమును పొంది అరణ్యాలకు వెళ్ళి తపస్సుచేసి

## భగవాన్ సాయి దివ్య సందేశం

విష్ణు సందర్శనమును పొందగలిగాడు. యుద్ధమునకు వెళ్ళేముందు అర్జునుడు తల్లి ఆశీర్వాదమును కోరగా 'విజయీభవ' అని దీవించింది. దుర్యోధనుడు యుద్ధమునకు వెళ్ళుతూ తన తల్లి గాంధారికి నమస్కరించి ఆశీర్వదించమని కోరగా "యత్ర ధర్మో తత్ర విజయః" (ఎక్కడ ధర్మమో అక్కడ విజయం ఉంటుంది.) అని ఆశీర్వదించింది. గురువుకు నమస్కరించగా "యత్ర ధర్మో తత్ర కృష్ణ", యత్ర కృష్ణో తత్ర విజయః" అని ఆశీర్వదించాడు. కనుక ధర్మము, దైవము ఎక్కడు ఉంటుందో అక్కడ మాత్రమే విజయం ప్రాప్తిస్తుంది. ఆనాటి తల్లుల దీవెనలు పిల్లలకు విజయాన్ని చేకూర్చేటటు వంటివి. తల్లి ఆశీర్వదించినప్పుడల్లా దైవము "తథాస్తు ! తథాస్తు !" అని ఉచ్చరించేటటువంటివాడు. కేవలం తల్లియొక్క ఆశీర్వాదము మాత్రమే చాలదు. దైవము యొక్క అనుగ్రహం కూడా అత్యవసరం. తల్లి యొక్క ఆశీర్వాదం 'నెగిటివ్', భగవంతుని యొక్క సంకల్పం 'పాజిటివ్'. ఈ నెగిటివ్, పాజిటివ్ రెండూ చేరినప్పుడే ఈ కరెంటును ఉపయోగించడానికి వీలవుతుంది.

కనుక ప్రతిమానవుడు తల్లి హృదయాన్ని సంతృప్తి పరచేటటువంటి తత్వాన్ని కలిగివుండాలి. తల్లి హృదయం సంతృప్తి పరచకుండా కుమారుడు ఎట్టి విజయాన్ని సాధించలేడు. కనుక తల్లి హృదయమును సంతృప్తిపరచేటటువంటి భావములను ప్రవర్తనను కుమారులు కలిగిఉండాలి. దానితో పాటు దైవము యొక్క అనుగ్రహమునకు కూడా పాత్రులుకావాలి. దైవానుగ్రహం లేకుండా కేవలం తల్లి ఆశీర్వాదంతోనే విజయాన్ని సాధించలేరు.

ఒకానొక సమయంలో యుద్ధానంతరం గాంధారిని ధృతరాష్ట్రుని చూడటానికి కృష్ణుడు వెళ్ళాడు. ధృతరాష్ట్రుడు చాలాబాధ పడ్డాడు. గాంధారి కోపంతో, దుఃఖంతో తీవ్రమైన పదజాలంతో కృష్ణుని విమర్శించింది. "కృష్ణా ! కౌరవులు, పాండవులు సోదరుల పుత్రులే. కౌరవుల మీద ద్వేషానికి, పాండవుల మీద ప్రేమకు కారణమేమిటి ? ఐదుగురు పాండవులను సురక్షితంగా రక్షిస్తూ వచ్చావు. కాని నూరుమంది కౌరవులలో ఒక్క కుమారుని కూడా మిగలకుండా చేశావు" అని కోపంతో మాట్లాడింది గాంధారి. అప్పుడు నవ్వుతూ కృష్ణుడు "గాంధారీ ! నీ బాధతో నీవు మాట్లాడుతున్నావు. నీకు నూరుమంది కుమారులు అయినప్పటికినీ, ఒక్క కుమారుని అయినా నీకంటితో ఎప్పుడైనా చూచావా ! తల్లి దృష్టికే నోచుకోలేనటువంటివాడు, దైవ దృష్టిని ఏరీతిగా పొందగలడు? కనుక కుమారులపైన తల్లియొక్క దృష్టి పరిపూర్ణంగా ఉండాలి. నేడు దుర్మార్గులైన కుమారులు కనిపిస్తారుకాని, దుర్మార్గురాలైన ఒక్క తల్లి కూడా కనిపించదు. అటువంటి మృదుమధురమైన తల్లి హృదయాన్ని చవిచూసి ఆమెను సంతృప్తి పరచటం కుమారుల విద్యుక్త ధర్మం.

మాతృదేవులను ఎంత ఆనందపరిస్తే, మాతృదేశం అంత ఆనందాన్ని అనుభవిస్తుంది. జననీ, జన్మ - ఈ రెండింటినీ ప్రతి ఒక్కరూ పూజించాలి, గౌరవించాలి.

"దైవప్రీతిలేని మానవత్వము బట్టి
పాపభీతిలేని దానిబట్టి
మానవత్వమణగె మానవులందున
విశ్వశాంతికిదియె విప్లవంబు."

ఈనాడు ఎక్కడ చూచినా 'దైవప్రీతి' అనేది కనిపించటం లేదు. కాని ఈనాడు పాపప్రీతి, దైవభీతి - ఈ రెండూ మాత్రం అభివృద్ధి చెందుతూ వస్తున్నాయి. పాపమంటే భయం లేదు, పుణ్యకర్మలు చేయటానికి మానవులు ఉత్సాహం చూపటం లేదు. కాని పుణ్య ఫలమును మాత్రము ఆశిస్తున్నారు. పాపకార్యాలు చేయటానికి వెనుకంజ వేయటం లేదు. కాని పాప ఫలమును మాత్రం అక్కరలేదంటున్నారు. ఎట్టి విత్తు నాటితే అట్టి మొక్కే మొలుస్తుంది. ఎట్టి మొక్కో అట్టి ఫలమే మనకు లభ్యమవుతుంది. కనుక మనము పాపకార్యములకు వెనుకంజ వేయాలి, పుణ్యకార్యములకు ముందంజ వేయాలి.

పాండవులు యుద్ధానికి బయలుదేరేటప్పుడు తల్లి కుంతీదేవి చక్కటి ఆశీర్వాదమును అందించింది. "నాయనలారా! మీరు యుద్ధమునకు పోతున్నారు. యుద్ధములో విజయమును సాధించడానికి వెళ్ళుతున్నారు. ధర్మం కొద్దీ విజయం లభిస్తుంది. కాని నా హృదయ బాధను కూడా మీకు చెబుతున్నాను వినండి!" అన్నది.

తారకాసురుని దోర్దర్పమణచువేళ
తల్లిదండ్రుల కిడ్డ ధన్య రక్ష

మాతృ దాసీత్వంబు మాన్పసురుకు వేళ
వినతపుత్రులకిడ్డ విమల రక్ష
జనకు యాగముగావ పనికి నేగెడు వేళ
తల్లి రాఘువునకిడ్డ ధర్మరక్ష
అట్టి ఘనరక్ష శ్రీ రక్ష యంజ్ఞరక్ష
రక్షలందున దివ్యమౌ శ్రీ రామరక్ష
తోడు నీడై మిమ్ము కాపాడు గాక!"

కనుక తల్లి ఆశీర్వాదము ఎంతైనా అవసరం. స్వామికి తల్లి తండ్రి అనేటటువంటి ప్రేమ లేదు. అయినప్పటికినీ మాతృప్రేమను నిరూపించే నిమిత్తమై స్వామి కూడనూ జన్మ యొక్క ఆదర్శమును అందించే నిమిత్తమై నా తల్లి సమాధికి పుట్టిన దినం వెళ్ళుతుండే వాడను. ఎందుకోసం వెళ్ళుతూ వచ్చాను? నేను ఏది చేసినప్పటికిని ఇతరులకు ఆదర్శవంతమైనదిగా నిరూపిస్తూ వచ్చాను. ఈ భావమును పురస్కరించుకొనియే తల్లుల యొక్క ఉత్తమ మనస్సులు కూడా కరిగి పోతుంటాయి.

ఇప్పటికి ఈ శరీరమునకు తల్లి మరణించి 30 సంవత్సరములైనది. కాని ఆమె సజీవంగానే, సదేహంగానే సంచరిస్తూ ఉండాలి. నా గదిలో ముగ్గురు పిల్లలు పడుకుంటారు. వారు కూడా ఈ దృశ్యాన్ని చూచారు. ఇది ఎందుకు ఈనాడు చెబుతున్నానంటే... ఆదర్శ వంతమైనటువంటి తల్లుల జీవితం అమృతమయమైనటు వంటి జీవితం. ఒకసారి ఉదయం భజన అయిన తరువాత లోపలికి వెళ్ళి ఆహారం తీసుకుని పూర్ణచంద్ర ఆడిటోరియంకు నేను వెళ్ళాను. తలుపు దగ్గర ఈమె (తల్లి ఈశ్వరాంబ) భౌతిక శరీరంతో నిలుచొని ఉన్నది. ఎందుకు వచ్చావ్? అని ప్రశ్నించాను. "స్వామీ! నీకొకటి విన్నవించుకోవటానికి వచ్చాను" అన్నది. "మీకు అన్నీ తెలుసును. మీరు సర్వజ్ఞులు. కాని ఒక్కటి మాత్రం నీవు కొంచెం అదుపులో పెట్టాలి." అన్నది. ఏమిటి? అన్నాను. "ప్రతి భక్తుడు, ప్రతి విద్యార్థి మీకు అప్పుడప్పుడు ఒక చేతి రుమాలా అందిస్తుంటాడు. కాని నా ప్రార్థనను మన్నించి ఎవరి చేతిరుమాలను మీరు తీసుకోవద్దు. కాలము సరిలేదు. చేతి రుమాలలో ఏదో విషం పూస్తుంటారు. మీరు సహజంగా ఆ రుమాలను తీసుకుని నోటిని తుడుచుకుంటుంటారు. ఎవరు మీకు నమ్మకమైన వారో? ఎవరు మీకు సరియైనటువంటి భక్తులో వారివి మాత్రమే మీరు తీసుకోండి! అందరి చేతిరుమాలలు మీరు ముట్టకండి" అన్నది. తల్లి యొక్క ప్రేమ మరణించిన తరువాత కూడనూ సజీవంగానే ఉంటుంటుంది. అమృత మయంగానే ఉంటుంటుంది.

మరి రెండు పర్యాయములు రాత్రి పూట కూడా వచ్చింది (తల్లి ఈశ్వరాంబ). నా రూములో పడుకొనే పిల్లలు కూడా చూచారు. వాళ్ళు ఎప్పుడూ అంతకు పూర్వం ఈమెను చూచినటువంటివారు కాదు. ఎవరీ ముసలమ్మ వచ్చింది? అని చాలా ఆశ్చర్యపడి పోతున్నారు. లిఫ్ట్‌కు బీగం (తాళం చెవి) మా దగ్గరే ఉంటుంది. దీనికి మెట్లు లేవు. ఈమె ఎట్లా వచ్చింది? ఇక్కడికి. అని అడుగుతున్న సమయంలో నేను లేచాను. మీరు ఏమీ ఆమెను అడుగకండి అని పిల్లలకు చెప్పి, నేను ఆమె దగ్గరకు వెళ్ళి "మరి ఎందుకోసం వచ్చావ్?" అని అడిగాను. "అప్పుడప్పుడు మిమ్ములను చూడందే, నేనుండలేను. మిమ్ములను ఒకతూరి చూస్తే చాలు, నాకు ఆనందం అవుతుంది. మిమ్ములను చూచిపోవటానికి వచ్చాను." అని చెప్పి అప్పుడు కూడా రెండుమాటలు చెప్పింది. "స్వామీ! అందరం భక్తులమే... భక్తులమే.... అని చెప్పుకుంటుంటారు. కాని ఎవరు భక్తులో? ఎవరు భుక్తులో? ఎవరు యుక్తులో? ఎవరు శత్రులో? (శత్రువులో) మాకు తెలియదు. పరిపూర్ణ భక్తుడైనటు వంటివాడు మీ ఆజ్ఞకు దేనికైనా సిద్ధమై ఉంటాడు. కాని ఈనాడు చాలామంది వారివారి స్వార్థ నిమిత్తమై భక్తిని ప్రకటిస్తూ వస్తుంటారు. వారు మీనుంచి వారి కోరికలను నెరవేర్చుకుంటారు. తరువాత మిమ్ములను మరచిపోతుంటారు. ఈ విషయంలో మాత్రం మీరు జాగ్రత్తగా ఉండండి." అని చెప్పింది. "నా జాగ్రత్తను గురించి నీవు చెప్పనవసరం లేదు" అని నేను చెప్పాను. చెప్పిన తరువాత నవ్వుకుంటూ తిరిగి వెళ్ళిపోయింది. 'మాతృప్రేమ' అనేది ఈవిధంగా ఉంటుందని చెప్పడానికి ఈ ప్రత్యక్ష ప్రమాణాలు మీకు అందిస్తున్నాను. ఆమె దేహమును మాత్రం వదిలిందిగాని, ప్రాణం ఎప్పుడూ స్వామితోనే ఉంటుంటుంది. ఒక పర్యాయం చెప్పింది. "నీ కోసం ఎన్నియో వ్రతములు చేశాను. ఎన్నియో పూజలు చేశాను. నా పూజా ఫలం నాకు పండింది, నీతో నేను 40 సంవత్సరాలు ఉండినాను. ఇదే నా ధన్యము" అన్నది.

ఈ దేహమునకు Grandfather (తాత) అసగా కొండమరాజు. ఆయన కూడా అంతే. ఆయనకు

నలుగురు కొడుకులు ఉండేటటువంటివారు. అందులో పెద్ద కుమారుడైన పెదవెంకమరాజుకు ఈ దేహము (బాబా) పుట్టినది. రెండవ ఆయన పేరు చినవెంకమరాజు, మూడవ ఆయన పేరు సుబ్బరాజు. నాల్గవ కుమారుని పేరు వెంకట్రామరాజు. ఈ నల్గురూ ఉండినప్పుడు చాలామంది పిల్లలుండడంచేత విభాగముల కోసంవారు ప్రయత్నిస్తూ వచ్చారు. అప్పుడు ఈ దేహమునకు 8 సంవత్సరములు అప్పుడు ఈ నల్గురు కొడుకులు కొండమరాజును ప్రశ్నించారు. ఈవయసులో మీరు విడిగా ఉండటం మంచిదికాదు. ఒక్కొక్క కొడుకు వద్ద ఐదేసి నెలలు చొప్పున మీరు ఉండండి అని చెప్పారు. నేను ఎవరివద్ద ఉండను. నాకు ఎవరు వద్దు. మీరందరూ ఈ ప్రాపర్టీ (ఆస్తి)ని తీసుకోండి. నాకు మాత్రం ఒక ప్రాపర్టీ (ఆస్తి)ని యివ్వండి. 'మీకు ఏ ప్రాపర్టీ కావాలి ?' అని అడిగారు. "సత్యము (బాలసాయి)ను మాత్రం నాకు యివ్వండి ! చాలు !" అన్నారు. సత్యము నాతో ఉంటే సర్వమూ నాతో ఉన్నట్లేనని భావించాడు కొండమరాజు. అప్పటి నుంచి నేను కొండమరాజు వద్దనే ఉండేవాడను. ఆయనకు 112 సంవత్సరములు వచ్చాయి. ఆయన పరమ భక్తుడు. నన్ను చక్కగా గుర్తించుకున్నాడు. నాకు 9వ సం॥ ప్రారంభమైంది. ఇంట్లో ఎవ్వరులేరు. నేను వంట చేస్తున్నాను. అతనికి వంట చేసిపెట్టటం నా Duty (పని). నాకు వంట చాలా బాగా తెలుసు. చుట్టు ప్రక్కలవారు వచ్చి నేనువండిన కూరలు తీసుకొనివెళ్ళేవారు. తలుపువేశాడు. నేను వంట చేస్తుంటే వచ్చాడు. "సత్యా! సత్యా !" అన్నాడు. 'ఏమిటి ?' అన్నాను. "నా రెండు చేతులూ పట్టుకున్నాడు. ఇవి చేతులు కావు. నీ పాదాలని తలచు. నేను ఒక కోరిక కోరుతున్నాను. నా అంత్య సమయంలో నీ చేతులతో నానోట్లో నీళ్ళు పోయాలి" అన్నాడు. నేను అప్పుడు వాగ్దానం యిచ్చాను. తరువాత అతను 19 సంవత్సరములు బ్రతికాడు. క్రొత్తమందిరం కట్టిన తరువాత క్రొత్తమందిరానికి కూడా ప్రొద్దున, సాయంత్రం వచ్చిపోయేవాడు. ఎంతైనా మానవత్వానికి కొంత అభిమానం ఉంటుంటుంది. ఈ అభిమాన, మమకారములచేతనే తమ యొక్క హృదయములను పూర్తిగా విప్పిచెప్పుకోలేక పోతున్నారు మనుష్యులు. తెల్లవారుజామునే క్రొత్తమందిరానికి వచ్చేవాడు. నేను క్రొత్త మందిరానికి ముందుగానున్న ఇసుకపై పడుకునేటటు వంటివాడను. ఆయన వస్తున్నాడని ముందుగానే తెలుసుకొని దుప్పటి నిండుగా కప్పుకొనేవాడను. మొహం కూడా కప్పుకొనేవాడను. ఎందుకంటే ? నేను మేలుకొని ఉన్నట్లు అతనికి తెలియకూడదని. అప్పుడు నేను నిద్రలోనున్నానని భావించి, పాదాల మీదనున్న దుప్పటిని తీసి పాదాలకు నమస్కారం చేసికొని వెళ్ళేవాడు. ఇతరులు చూస్తే 116 సంవత్సరములవాడు తన మనుమడికి పాదనమస్కారం చేస్తున్నాడేమిటానని ఎవరైనా ఏమైనా అనుకుంటారేమోనని ఆయనకు అభిమానం. ఆయన వెళ్ళిపోగానే నేనులేచి కూర్చొనేవాడను.

" మేను మరచి నిదిరించే వారిని
మేలు కొలుపగలరెవరైనా ?
కనులు మూసుకొని నిదుర నటించే
ఘనుని లేపగ ఎవరితరము ?
జాలమేలోయి కృష్ణా ! లీలలు చాలోయి !"

అని గోపికలు పాడేవారు. పూర్తి నిద్రలోవున్నటు వంటి వాడిని ఎవరైనా వచ్చి లేపవచ్చును. కనులు మూసుకొని నిద్రపోయినట్లు నటించేవారిని ఎవరు లేపగలరు ? ఆ విధంగా కనులు మూసుకొని నిద్రపోయినట్లు నేను నటించేవాడిని. అలాంటి వారిని ఎవరూ లేపలేరు. లేపటం కూడా సాధ్యంకాదు. ఈ విధంగానే నేను లీలలు చేస్తూ వచ్చేవాడను. ఆయనకు చెప్పిన వాగ్దానం సమీపించింది. కొండమరాజు "ఈశ్వరాంబా ! రా !" అన్నాడు. "స్వామి వస్తున్నాడు, నా

## సనత్సు జాత ఉవాచ

క్రోధః కామోలోభ మోహో విదిత్సా
కృపాసూయా మానరోషౌ స్పృహాచ
ఈర్ష్యా జుగుప్సాచ మహా గుణేన
సదావర్జ్యా ద్వాదశైతే నరేణ

క్రోధం, కామం, లోభం, మోహం, విషయ సుఖాపేక్ష, అకృప, అసూయ, గర్వం, రోషం స్పృహ, ఈర్ష్య, జుగుప్స - ఈ పన్నెండు దోషాలు మనుష్యునిలో ఉంటాయి. ఇవి దుర్గుణాలు కాబట్టి ఉత్తముడు వీటిని వదిలి వేయాలి.

కోసమే వస్తున్నాడు. నేను పోయే ఆఖరి సమయం ఆసన్నమైంది. నీవు ఒక గ్లాసుతో నీరు తీసుకొనిరా ! తులసీ దళాలు ఆ గ్లాసులో వేయి'' అన్నాడు. నన్ను మంచం మీద కూర్చోమన్నాడు. "స్వామీ ! ఆకాశమైన ముక్కలు కావచ్చునేమోగానీ, నీ వాగ్దానభంగం మాత్రం కాదు. సముద్రమైనా ఎండిపోవచ్చునేమోగాని, నీ వాగ్దానం ఏనాటికి వృధాకాదు. పది సంవత్సరముల క్రిందట యిచ్చిన వాగ్దానం ప్రకారం మీరు ఈనాడు నావద్దకు వచ్చారు'' అన్నాడు. నేను నవ్వాను. " ఇదిగో ! ఈ గ్లాసును తీసుకోండి! దీనిలోని నీటిని త్రాగండి. మిగిలిన నీటిని నానోటిలో పోయండి.'' అని అభ్యర్థించాడు.

ఆ సమయంలో ఒక చరిత్ర చెప్పాడు. "పుత్ర కామేష్టి'' యాగం చేసి దశరథుడు నలుగురు కుమారులను కన్నాడు. సాక్షాత్ నారాయణమూర్తియే, శ్రీరామునిగా అతనికి జన్మించాడు. ఆదిశేషుడు లక్ష్మణుడుగా పుట్టాడు. శంఖచక్రములే భరత శత్రుఘ్నులుగా పుట్టారు. ఇంతమంది మహానుభావులు అతని కడుపున జన్మించినప్పటికినీ, అవసానదశలో దశరథుని నోటిలో ఒక్కరైనా నీరుపోసేవారు లేకపోయారు.'' అని చెప్పి "స్వామీ! మా రత్నాకర వంశములో మీరు జన్మించారు. ఆపస్తంభ సూత్రం, భరద్వాజ గోత్రం. ఇవన్నీ దైవమునకు సంబంధించినటువంటివే. ఆ దైవం నా గృహంలో పుట్టాడు. ఇదిగో! ఈ ఒక్కప్రాప్తి మాత్రం నాకు అందించండి! నన్ను నిరాశపరచకండి!'' అని ప్రార్థించాడు. ఆ గ్లాసు తీసికొని అతని నోటిలో పోయబోయాను. "వద్దు...వద్దు. నీవు త్రాగి నాకు పోయాలి అన్నాడు. ఆ విధంగానే చేశాను.

"ఈశ్వరమ్మా! స్వామియొక్క ప్రభావం యావత్ ప్రపంచమంతా పాకుతోంది. ఈ ప్రపంచమే చాలా మార్పుచెందుతోంది, అన్ని దేశాలవారు ఇక్కడకు ఏతెంచుతారు. జాగ్రత్తగా ఉండండి! మాయతో నా కుమారుడు! మా పిల్లవాడు! అనేటటువంటి అభిమానానికి అవకాశం ఇవ్వకండి. అతను అందరివాడు. స్వామి అందరివాడు. మీ కుటుంబానికి మాత్రమే సంబంధించినవాడు కాదు.'' అని చెప్పి నా పాదాలపై ఆయన చేతులు పెట్టి ప్రాణాలు విడిచాడు. ఆయన కూడా తిరిగి అప్పుడప్పుడూ వస్తుంటాడు. " స్వామీ! నాకు ఇక జన్మలేదు. నేను నీ ప్రసాదం చేత ధన్యుడనైపోయాను అమృత స్వరూపుడనైపోయాను.'' అని అంటుంటాడు. అప్పుడప్పుడు తిరిగి అదే దేహంతో వచ్చి మందిరంలో అవి జరుగుతున్నాయి, ఇవి జరుగుతున్నాయి జాగ్రత్తగా ఉండండి స్వామీ! ''అని చెప్పి పోయేవాడు "మీరు ఎవ్వరికీ చిక్కరు. మీకు ఎట్టి భయములేదు. కానీ నేను ఆ దేహముతో సంబంధం ఉన్నవాడను కనుక నేను చెబుతున్నాను. ఇది నా ప్రార్థనగా భావించండి!'' అని చెప్పేవాడు, ఇప్పటికీ కూడనూ ఆ కొండమరాజు, ఈశ్వరమ్మ అప్పుడప్పుడూ వస్తుంటారు, నాతో మాట్లాడుతుంటారు, పోతుంటారు.

ఈమధ్య ప్రశాంతి నిలయంలోపల ఒకరికి గుండెపోటు వచ్చి చాలా ప్రమాదం ఏర్పడింది. నేను రాత్రి 2 గంటల ప్రాంతంలో ఈ దేహమును వదలి అక్కడకు పోయాను. రెండవదినం 3 గంటల వరకు ఈ దేహం నుంచి బయటకు రాలేదు. స్వామి ఎందుకు రాలేదు...ఎందుకు రాలేదు....అంటూ చాలా బాధపడుచూ వచ్చారు. క్రింద పడుకున్న, పైన పడుకున్నపిల్లలు అక్కడకు వచ్చి ఏడవటం మొదలు పెట్టారు. చిరంజీవరావు వెళ్ళి డా॥ అల్వేజాను తీసికొని వచ్చాడు. అతనికి స్వామి అంటే చాలా భక్తి. అతను 40 సంవత్సరములనుండి ప్రశాంతి నిలయంలో ఉంటున్నాడు. పల్సుచూశాడు. ఏమీ అందలేదు. ఏమీ చెప్పలేక ఏడ్చాడు. శరీరంలో ఉండవలసిన లక్షణాలు ఒక్కటీ లేవన్నాడు. అప్పుడు చిరంజీవరావు చెప్పాడు. "స్వామి అప్పుడప్పుడు ఈ దేహమును వదిలి వెళ్ళటం సహజం, లోగడ చూచాం, ఎవ్వరికీ చెప్పవద్దని అక్కడున్న ఆరుగురి పిల్లలకు చెప్పాడు. ఆ ఆరుగురు మంచి పిల్లలు. స్వామి కాలేజీలో ఎం.బి.ఏ. చదివి ఢిల్లీ వెళ్ళి అక్కడ హాస్పటల్లో టెక్నీషియన్సుగా పని చేస్తున్నారు. కాని పిల్లలు భరించుకొనలేకపోయారు. కాళ్ళమీదపడి భోరున ఏడ్చారు. తక్షణమే నేను నవ్వుతూ లేచాను. ఏమిటి ఈనాటకమంతా అన్నాను. స్వామీ! ఈ డ్రామా ఆడేది మేమా లేక మీరా అన్నారు . వారిలో శ్రీనివాస్ అనే అతను ఉన్నాడు . ఇదంతా మీలీలా నాటకమే. మా నాటకం కాదు అన్నాడు. బయట అంతా నా కోసం చాలా మంది కాచుకొని ఉంటారు. నేను వెళ్ళాలి అన్నాను. రాత్రి నుంచి అప్పటి వరకు స్వామి నీరైనా త్రాగలేదు. ఏదైనాత్రాగండి. కనీసం మజ్జిగ అయినా త్రాగండి అని

సంపాదించినంత మాత్రమున ప్రయోజనం లేదు. గొప్పవాడని పేరురావచ్చును. 'గొప్పవాడు' అనే పేరు కంటే 'మంచివాడు' అని పేరు రావాలి. 'గొప్పవాడు' అంటే ఫలితం ఏమిటి ? కేవలం అంతా స్వార్ధమే... స్వార్ధమే..... మంచివాని యందు అంతా నిస్వార్ధమే.... నిస్వార్ధమే... కనుక ప్రతి పిల్లవాడు మంచివానిగా తయారు కావాలని నా కోరిక.

బ్రతిమాలారు పిల్లలు. అలవాటు లేదని చెప్పి స్నానం చేసి బయటకు వెళ్ళాను. ఈవిధంగా అప్పుడప్పుడు చాలా జరుగుతునే ఉంటాయి. తల్లి యొక్క ప్రేమను పొందినవారికి జీవితమంతా అమృతమయంగానే ఉంటుంటుంది. ఆ తల్లి కూడా కుమారుడి యొక్క ఉత్తమ భావాలను కొంత పోషిస్తూ రావాలి. కుమారులు ఆధ్యాత్మిక మార్గంలో ఉంటే ఏమైపోతారో అని కొంతమంది తల్లులు దిగులు పడుతుంటారు. ఎన్ని జన్మల పుణ్యము వలననో వారికి ఆ విధమైన ప్రాప్తి లభిస్తుంటుంది. దానికి మనం ఆనందించాలి గాని, విచారించకూడదు. చాలా మంది తల్లులు చదువులు అయిన తరువాత వారి పిల్లలకు వివాహం చేయాలి, వారు ఉద్యోగం చేయాలి, గొప్పవారు కావాలని ఆశిస్తుంటారు. తల్లిదండ్రులు ప్రేమ చేత వారి పిల్లలు గొప్పవారు కావాలని ఆశిస్తుంటారు. కాని స్వామి యొక్క ప్రేమ అలాంటిది కాదు. పిల్లలు మంచివారు కావాలని స్వామి కోరుకుంటారు. పిల్లలు గొప్పవారు కావాలని తల్లిదండ్రులు కోరుకుంటారు. అసలు మంచికి, గొప్పకు ఉన్న తేడా ఏమిటి ? మంచివారు మానవుని యందు కూడనూ దైవాన్ని చూస్తుంటారు. గొప్పవారు దేవుని యందు కూడనూ మానవత్వాన్ని చూస్తుంటారు. రావణుడు గొప్పవాడు, మహా తపస్వి, గొప్ప శక్తివంతుడు. కాని రాముని యందు కూడనూ మానవత్వంగా చూసి, ఇతను ఒక మానవుడని భావిస్తూ వచ్చాడు. కాని రాముడు అట్లా కాదు. సర్వజీవుల యందు కూడనూ దైవత్వాన్ని చూస్తూ వచ్చేటటువంటివాడు. అది మంచితనం. 'ఈశ్వర స్సర్వ భూతానాం', 'ఈశావాస్య మిదం సర్వం'. కనుక గొప్పతనానికి, మంచితనానికి ఉన్న భేదం ఇదే. గొప్ప చదువులు చదివి, గొప్ప ఉద్యోగం చేసి గొప్పగా

'తల్లిదండ్రులను గౌరవించండి ! వాళ్ళకు ఆనందం యివ్వండి ! వారికి కృతజ్ఞత చూపాలి' అని ఈవిధంగా చెబుతుంటాను. వాళ్ళు కూడా దానికి అంగీకరిస్తుంటారు. వారికి కూడా కొంత స్వార్ధం ఉంటుంటుందిగదా ! తల్లిదండ్రులకు ఏవిధంగా స్వార్ధం ఉంటుందో ! కుమారులకు కూడా కొంత స్వార్ధం ఉంటుంది. తల్లిదండ్రులు ఈవిధంగా ఉండాలని కోరుతున్నారు. కాని కొంతమంది పిల్లలు మాకు అది ఇష్టం లేదంటున్నారు. మేము స్వామి దగ్గరనే ఉండాలి, స్వామి సేవలే చేయాలి. మీ అందరికీ తెలుసు. కొడైకెనాల్‌కు వచ్చిన పిల్లలకు పబ్లిక్‌గానే చెప్పాడు సత్యజిత్. అక్కడ వాళ్ళ తల్లిదండ్రులు కూడా ఉన్నారు. ఏమీ దాచుకోకుండానే చెప్పాడు. "నాకున్న సందేహం చెబుతున్నాను. దీనిని మీరు విమర్శగా భావించకండి. అందరూ క్షమించాలి" అని మొట్టమొదట అందర్ని ప్రార్ధించాడు. "స్వామి వద్దకు ఎంతోమంది అధికారులు వస్తున్నారు. వారి వారి కోరికలు నెరవేర్చుకుంటున్నారు, వెళ్ళిపోతున్నారు. ఎంత మందో వ్యాపారస్తులు వస్తున్నారు. వారి నష్టాలు, కష్టాలు చెప్పి స్వామి నుంచి అనుగ్రహాన్ని పొంది వాళ్ళు వెళ్ళిపోతున్నారు. రోగిష్టులు వస్తున్నారు. స్వామి ఆశీస్సులతో రోగములను నయం చేసుకొని వారు ఆనందంగా వెళ్ళిపోతున్నారు. అనేకమంది విద్యార్థులు వస్తున్నారు, స్వామి యిచ్చేటటు వంటి ఉచిత విద్యను అందుకుంటున్నారు, అభ్యసిస్తున్నారు, వెళ్ళిపోతున్నారు. స్వామి యొక్క మంచిని ఎవరు తలచుకుంటున్నారు ? ఎవరూ తలచుకోవటంలేదు. కాబట్టి స్వామి ఎప్పుడు అంటే అప్పుడు పడిపోతుంటారు" అని చెప్పాడు సత్యజిత్. అది అతనికి కూడా తెలుసు. ఒక రోజున పడ్డాను. ఒక పెద్ద

Piller (స్తంభం) నాపైన పడిపోయింది. అయితే దానిని Care చేయలేదు. పిల్లలు చాలా బాధపడుతూ వచ్చారు. ఇవన్నీ చూచినటువంటివాడు కనుక స్వామి వెంట ఎప్పుడూ ఒకరుండాలని భావించాడు. "స్వామి ప్రక్కన ఒకరిద్దరైనా కూర్చొని భోజనం చేస్తుంటే, ఇంతైనా స్వామి భోజనం చేస్తాడు. ఒంటరిగా పోతున్నాడు. హారతి పూర్తికాకమునుపే తిరిగి వస్తున్నాడు. ఏమో ఏమి తింటున్నాడో !" అని బాధపడ్డాడు సత్యజిత్. నేను పుట్టపర్తి నుంచి యిక్కడకు (బృందావన్) వచ్చి పిల్లల్ని తీసుకొని కొడైకెనాల్ వెళుతున్నాను. పుట్టపర్తిలో ఇంత రాగి సంకటి, ఇంత వేరుశనక్కాయ పచ్చడి - ఈ రెండూ నేను భుజించేటటువంటివి. కొడైకెనాల్‌లో అందరం ఒకే పంక్తిలో కూర్చొని భోజనం చేస్తుండేవాళ్ళం. నేను వారి మధ్యనే కూర్చొని భోజనం చేసేవాడ్ని. నేను సంకటి తింటే వారికి ఇష్టంగా ఉండదు గదా ! పోనీ వారిని కూడా తినమందామంటే వారికి అది అలవాటు ఉండదు. నా ఉద్దేశ్యమేమిటంటే పిల్లలు ఏమి తింటారో నేను అది తినాలి. నేను ప్రత్యేకంగా తినకూడదు. కనుక పిల్లలకు అనుకూలంగా ఉన్న అన్నమే నేనూ తినాలని, అన్నం తినటం అలవాటు చేసుకుంటూ వచ్చాను. అయితే నాకు అన్నం అంత ఇష్టంగా ఉండేదికాదు. దీని వలన 20 రోజులలో ఎనిమిది పౌన్లు తగ్గిపోయాను. పుట్టపర్తిలో బయలుదేరేటప్పుడు నా బరువు 108 పౌన్లు ఉండేది. ఇంత బరువు తగ్గిపోయినందుకు 'సత్యజిత్' చాలా బాధపడ్డాడు. "నా జీవితమంతా స్వామి పాదాలకు అర్పితం కావాలి" అని పబ్లిక్‌లో చెప్పాడు. "ఇదంతా చెప్పకూడదు. ఏ నిమిషంలో ఎప్పుడు ఏ రీతిగా జరుగుతుందో ఆవిధంగా చెప్పకూడదు" అని చెప్పాను. ధైర్యం చేసి ఒక విధంగా తీవ్రంగా మాట్లాడాడు సత్యజిత్. ఆ సమయంలో అక్కడ ఇందూలాల్‌షా కూడా ఉన్నారు. చాలామంది సత్యజిత్‌ను అభినందించారు. రెండవ దినం బహిరంగ సభలో ఇందూలాల్‌షా మాట్లాడుతూ, "నేను సెంట్రల్ ట్రస్టులో ఉండి కూడను స్వామి యొక్క విషయాలను పట్టించుకోవటంలేదు. మాది తప్పే. క్షమించండి" అని సత్యజిత్‌ను కోరాడు. ఇకముందు ఈ విషయాన్ని దృష్టిలో పెట్టుకొని వ్యవహరిస్తామని 'షా' చెప్పారు. కనుక ఒక్కొక్కరికి ఒక్కొక్క విధమైన ఆలోచనలు, ఆశయాలు ఉంటుంటాయి. కాని మాతృభావం ఉండినటువంటివారికి మాత్రం ఎప్పుడూ ఉత్తమ భావాలు ఉంటూనే ఉంటాయి.

నాకు అందరూ సమానమే. నా దృష్టిలో అందరూ మంచివారే. కాని ఈ పిల్లవాడు నిలయం వచ్చినప్పుడల్లా, స్వామి ఆజ్ఞను తీసుకొనిపోయి, కొంతసేపు తల్లి కాళ్ళు వత్తి వచ్చేటటువంటివాడు. ఆమె నడవటానికి కాళ్ళు నొప్పిగా ఉంటాయి గనుక ఆ సేవ నేను చేయాలనేవాడు. ఒక పర్యాయం బృందావనంలో మధ్యాహ్నం పడుకున్నాను. వచ్చి మెత్తగా నా పాదములు వత్తుతున్నాడు. "నాకేమి నొప్పిలేదే ?" అన్నాను. 'కానీ నొప్పి ఉన్నా మీరు చెప్పరు' అన్నాడు. "ఇంత తిరుగాడుతుంటారు. కనుక మీ పాదములు ఒక్క తూరి వత్తిపోతాను" అన్నాడు. 'నీకెట్లా ఇది అభ్యాసమైంది' అని అడిగాను. 'నా తల్లికి ఈ సేవ చేసి నాకు అభ్యాసమైంది' అన్నాడు. నా కాళ్ళు వత్తినాడు. కొంచెంసేపయ్యేటప్పటికి స్వామి అక్కడలేడు. స్పష్టంగా తాను చూచాడు. తాను తిరిగి పుట్టపర్తి పోయాడు. హాస్టల్‌లో ఉన్నాడు. అక్కడ పోయి కళ్ళు మూసుకున్నాడు. స్వామి పాదాల దగ్గర ఉన్నాడు. ఇవన్నీ అతని అనుభవాలు. "ఇంత అనుభవాలను నేను అనుభవించినప్పుడు నేను ఎట్లా ఈ ప్రపంచాన్ని కోరుతాను. ఈ "అప్రాకృతమైన జీవితం నాకు అక్కరలేదు" అన్నాడు. "ఇవన్నీ చెప్పకూడదు. నోరు మూసుకొని నీపని చేయి" అన్నాను. ఎం. ఎస్. సి. ప్యాసయినాడు. తిరిగి ఎం. బి. ఏ.లో చేరాడు. Post Graduation అయిందిగదా ! ఇంకా ఎందుకు నీకు ఎం. బి. ఏ. అన్నాను. "ఇంకా రెండు సంవత్సరములు మీ సన్నిధిలో ఉండవచ్చును గదా ! అందుకోసమే ఎం.బి.యే. లో చేరాను" అన్నాడు. ఈ విధంగా ఒక్కొక్కరి ఆశలు ఆవిధంగా ఉంటుంటాయి. ఇలాంటి పిల్లలు ఎంతమందో ఉంటున్నారు. మాతృభావమనేది రుచిచూచినటువంటివారికి, దైవాన్ని కూడనూ మాతృభావనతోనే చూస్తుంటారు.

కొంతమంది ఇంత చదువుకుంటున్నారు, బయటకు పోతున్నారు, ఏమి చేస్తున్నారు ? ఏమి సుఖపడుతున్నారు ? ఏమి శాంతిని పొందుతున్నారు ? అని వాదిస్తున్నారు. ఏ జన్మాంతర కర్మనో వీళ్లకు బట్టి ఇందులో పడిపోతున్నారు అంటాడు సత్యజిత్. కాదు... కాదు... దైవము చిక్కిన తరువాత ఏదీ మనకు అక్కరలేదు. ఆ దైవమే తల్లిని, తండ్రిని అందరినీ చూచుకుంటాడు.

ఆ ప్రగాఢ విశ్వాసము గట్టిగా ఉండాలి. అదిలేకపోతే ఎవరికీ సుఖములేదు.

నెల్లూరు నుంచి ఒక రెడ్డి పుట్టపర్తి వచ్చి 'ప్రహ్లాద' అనే సినిమాను పిల్లలకు చూపించాడు. ఆ సినిమాలో ప్రహ్లాదునికి అతని తండ్రి విషమిచ్చినా 'నారాయణా... నారాయణా...' అని త్రాగాడు. అది నారాయణునికే చెందిపోయింది. కొండలమీద నుండి నెట్టించుతే దొర్లుతూ 'నారాయణా... నారాయణా...' అన్నాడు. నారాయణుడు వచ్చి క్రిందపడకుండా పట్టుకున్నాడు. సర్పములచేత కరిపించగా 'నారాయణ... నారాయణా...' అనగా సర్పములన్నీ హారములుగా మారిపోయాయి. ఏనుగులచేత త్రొక్కించగా 'నారాయణ... నారాయణ...' అన్నాడు. ఏనుగు కూడా నారాయణుడుగ రూపొందింది. అది చూచి సత్యజిత్ "స్వామీ ! అవన్నీ సినిమాలు. నేను ప్రత్యక్షంగా చూస్తున్నాను. కాబట్టి నాకు ఏ నారాయణుడు అక్కరలేదు. సాయి నారాయణుడు నాకు చాలు" అన్నాడు. ఏ జన్మాంతర సుకృతమోగాని ఆ లేత వయసులో ఇలాంటి భావాలు కలుగుతుంటాయి. మొన్న చెప్పాను. భజన చేస్తున్నారు. భజనకు వెళ్ళమని చెప్పాను. అశోక వృక్షం క్రింద కూర్చొని భజన చేసుకుంటానన్నాడు. నేను ఎటువంటి వత్తిడి పెట్టను. నీకు ఎక్కడ ఇష్టంవుంటే అక్కడ చేసుకోమని చెప్పాను. ఈవిధంగా కొంతమందిలో ఉత్తమ భావాలు ఉంటుంటాయి. కొంతమంది కాలేజీలో ఉన్నంతవరకు పరమభక్తులే. బయటకు పోతే పరమ దుర్మార్గులు. వారు మాట్లాడే మాటలు, వారు చేసే పనులు ఎంత చెడ్డవో అంత చెడ్డగా ఉంటుంటాయి. కొడైకెనాల్‌లో చెప్పాను. మంచి వాక్కు రావాలి. మంచి వాక్కులేకపోతే ప్రయోజనం ఏమిటి ? అసలు మొదట 'సమ్యక్ దృష్టి' రావాలి. 'సమ్యక్ దృష్టి' వచ్చేటప్పటికి 'సమ్యక్ భావం' ప్రవేశిస్తుంది. 'సమ్యక్ భావం' వచ్చేటప్పటికి 'సమ్యక్ శ్రవణం' అయిపోతుంది. 'సమ్యక్ శ్రవణం' అయ్యేటప్పటికి 'సమ్యక్ కర్మలు' చేస్తారు. సమ్యక్ కర్మలే నిర్వాణమునకు ఒక మార్గము. కనుక మొట్టమొదట 'సమ్యక్ దృష్టి' ఉండాలి. కనుక మొదట ఈ దృష్టిని అదుపులో పెట్టుకోండి ! అప్పుడు సర్వమూ అదుపులో ఉంటుంది. ఈ తూరి కొడైకెనాల్‌కు వచ్చిన పిల్లలందరూ ఉత్తములు. వారు ఎంత అదృష్టవంతులో ! కనుకనే వాళ్ళ సర్వస్వమూ నేనే చూచుకుంటూ వచ్చాను. ఈ విధమైన పిల్లలు అభివృద్ధి అవుతే దేశం ఎంత బాగుపడుతుంది.

వ్యక్తి బాగుపడినప్పుడే సమాజం బాగుపడుతుంది. సమాజం బాగుపడినప్పుడే దేశం కూడా బాగుపడుతుంది. కనుక మొదట ఒక వ్యక్తి బాగుపడాలి. అతనే వ్యక్తి. సమాజమే సమిష్టి. వ్యష్టి సమిష్టి ఈ సమిష్టి యొక్క స్వరూపమే ఈ సృష్టి. వ్యష్టి సమిష్టి సృష్టి ఈ మూడింటి యొక్క ఏకత్వమే దైవత్వము. కనుక మొట్టమొదట మాతృదేవిని స్మరించాలి. ఆమెకు తగినటువంటి సంతృప్తిని కలిగించాలి. ఆమెకు తగినటువంటి కృతజ్ఞతలు చూపాలి. అలాంటి కొడుకులు పుట్టటం, ఆ తల్లుల యొక్క అదృష్టం అటువంటిది. అదే కొండమరాజుకూడా చెప్పాడు. "ఈశ్వరమ్మా ! నీవు సామాన్యమైన స్త్రీ మాదిరిగా ఉంటున్నావు. నీవు సామాన్యమైన స్త్రీవి కాదు. భగవంతుడు నీ గర్భమున జన్మించాడు. నీవు ఎంత అదృష్టవంతురాలవమ్మా !" అని నమస్కారం చేసి చెప్పేవాడు. ఈశ్వరాంబ, కొండమరాజు కోడలు. కోడలికి నమస్కారం చేసి చెప్పే మామలు ఎక్కడైనా ఉన్నారా ? "ఈశ్వరమ్మా ! నీ పేరు సార్థకం అయిపోయిందమ్మా ! ఈశ్వరునికి అమ్మ - ఈశ్వరమ్మ" అని వర్ణించాడు కొండమరాజు. ఈ విధంగా తెలుసుకున్నటువంటివాడు ఎంతైనా తెలుసుకుంటాడు. తెలుసుకోలేనటువంటివాడు ఎన్ని చూపినా తెలుసుకోలేడు. ఏకించిత్ దృష్టి ఉండినప్పటికినీ సూర్యోదయం చూడగలడు అసలు కన్నులేకపోతే సూర్యుని ఎట్లా చూడగలడు ? కనుక ఆధ్యాత్మికతత్వము, ఈ మాతృభక్తి ఉన్నటువంటివారు ఏమైనా సాధించవచ్చును. కనుక మాతృదేవి తత్వమును

## సుభాషితములు

**"కోకిలానాం స్వరోరూపం**
**పాతివ్రత్యం తు యోషితామ్**
**విద్యా రూపం విరూపాణాం**
**క్షమారూపం తపస్వినామ్"**

కోకిలకు స్వరమే రూపము. స్త్రీలకు పాతివ్రత్యమే రూపము. రూప హీనులకు విద్యయే రూపము. తపస్సు చేసికొనువారికి ఓరిమియే రూపము.

ప్రతి ఒక్కరూ అర్థం చేసుకోవాలి. కొంత వయస్సు వచ్చేటప్పటికి తల్లి! తల్లి! ఆమె ఏమి చేసింది ? ఏదో చిన్నప్పుడు సాకింది. ఇప్పుడు మా వ్యవహారాలు మేమే చేసుకుంటున్నామని కొందరు అహంకారపడుతుంటారు. నేను పెద్ద చదువు చదివాను, నేను పెద్ద ఉద్యోగం చేస్తున్నాననుకుంటాడు. ఏమిటి నీ చదువు ? ఏమిటి నీ ఉద్యోగము ? ఏమిటి నీ ధనము ? ఇవన్నీ శాశ్వతం కావు.

" మాతా నాస్తి పితా నాస్తి
నాస్తి బంధు సహోదరః
అర్థం నాస్తి గృహం నాస్తి
తస్మాత్ జాగ్రత్త ! జాగ్రత్త !"
జన్మ దుఃఖం జరా దుఃఖం
జాయా దుఃఖం పునః పునః
అంత్యకాలే మహా దుఃఖం
తస్మాత్ జాగ్రత్త ! జాగ్రత్త !"

శంకరాచార్యులు కూడా అట్లాగే చేశాడు. ఒక చిన్న ఉదాహరణ. తండ్రి ఎక్కడి ఎక్కడికో పల్లెకు పోవలసివచ్చి శంకరుని తల్లి అయిన ఆర్యాంబకు చెప్పాడు. "చూడు ! రేపటి దినం పూజచేయటానికి ఎవరూ లేరు. మన పిల్లవాడు శంకరాచార్యకు చెప్పు !" అన్నాడు. తల్లి వచ్చి "నాయనా ! ఈనాడు మీ తండ్రి లేడు. రాజరాజేశ్వరికి, పాలునైవేద్యం చేయి" అని చెప్పింది. పాలు తీసుకొని వెళ్ళాడు. "తల్లీ! నీవు ప్రత్యక్షమై ఈ పాలను త్రాగాలి! మా నాన్న ఇస్తుంటే నీవు త్రాగుతున్నావుట. ఆ ప్రసాదం నాకు, నా తల్లికి యిస్తుండేవాడు. కాబట్టి నీవు ఈ పాలను త్రాగాలి" అన్నాడు. ఎంతసేపటికీ తల్లి ప్రత్యక్షం కాలేదు. రాయి తీసుకుని వచ్చాడు. నీవు త్రాగకపోతే తల పగులకొట్టుకుంటానన్నాడు. అప్పుడు శంకరాచార్యునికి 7 సంవత్సరములు. శబ్దం వచ్చింది. కళ్ళు తెరిచాడు. రాజరాజేశ్వరి వచ్చి పాలు త్రాగి వెళ్ళింది. గ్లాసు చూచాడు. ఆ గ్లాసులో ఒక్క చుక్క కూడా పాలు కనిపించలేదు. పూర్తిగా త్రాగేసి వెళ్ళింది. "అమ్మా! మొత్తం నీవే త్రాగితే నాకు, మా అమ్మకు ప్రసాదం ఎక్కడ? నాకు, మా అమ్మకు ప్రసాదం కావాలి. నాకు కొంచెం యిచ్చి వెళ్ళు!" అన్నాడు. ప్రార్థన చేశాడు. తిరిగి దేవి ప్రత్యక్షం కాలేదు. "ఆపాలను నేనే త్రాగినానని నా తల్లి భావిస్తుంది. నాపై నా తల్లికి చెడ్డ భావం రాకూడదు. ఆమెను సంతృప్తి పరచడానికైనా నాకు కొంచెం పాలు యివ్వు." అని ప్రార్థిస్తాడు. అప్పుడు దేవి "నాయనా! సముద్రములో చేరిన గంగ తిరిగి వస్తుందా? నమిలి మ్రింగిన ఫలము తిరిగి వెనుకకు వస్తుందా? రాదు. నేను పాలు త్రాగాను. ఇకరాదు" అంటుంది. 'ఏమైనా సరే నాకు పాలు కావాలి' అని పట్టుపడతాడు శంకరుడు. ఆ పిల్లవాని భక్తికి మెచ్చి తన చనుబాలు ఆ కప్పులో పిండి యిస్తుంది దేవి. ఆ పాలను శంకరుడు త్రాగుతాడు. అందువలననే శంకరుడు అవతార పురుషుడుగా మారిపోయాడు. సర్వజ్ఞాని అయినాడు. నాలుగు వేదములు, ఆరు శాస్త్రములు 32 సంవత్సరముల లోపునే సర్వమునూ ప్రపంచానికి చాటాడు. కారణమేమిటి? ఆ తల్లి యొక్క పాలు త్రాగటం చేతనే అంతటి అదృష్టవంతుడయ్యాడు. తల్లి అంతటి మధురమైన స్వరూపము. మాతృప్రేమ ప్రాకృతమైన ప్రేమయే. ఆమెకు ప్రాకృతమైన దానినే మనం అందించాలి. హృదయమును మాత్రం ఒక్క దైవానికి తప్ప మరొకరికి కాదు. అసలు అతని పేరే 'హృదయవాసి' అమ్మపేరు 'గృహవాసి'. నాన్నపేరు 'గృహవాసి'. గురువు పేరు 'ఆశ్రమవాసి'. ఒక్క దైవము మాత్రమే 'హృదయవాసి' కనుక హృదయంలో నివసించడానికి అధికారం ఒక్క దైవమునకు మాత్రమే ఉన్నది. కనుక హృదయంలో దైవాన్ని పెట్టుకోండి. ప్రాపంచంలో తల్లిని చూచుకోండి. గౌరవమును ఇవ్వండి. పాదసేవలు కూడా చేయండి.

"ఇహంలో సుఖింప హేమతారక విద్య, పరంలో సుఖింప బ్రహ్మవిద్య." దీనినే "దిల్ మే రామ్ హాత్ మే కామ్" అన్నారు. చేతులతో సేవ చేయి. హృదయంలో దైవత్వాన్ని ప్రతిష్టించుకో. ఇది ఉంటే నీవు ఎన్ని అయినా సాధించవచ్చు. కనుక మాతృప్రేమను ప్రేమతో చూచుకొని, ప్రేమ చేతనే ఆమెను ఆనందపరచి, ఈ ప్రేమతత్వంతోనే దైవాన్ని పొందాలి.

*(ది. 6-5-1998న బృందావనంలో ఈశ్వరమ్మ వర్ధంతిని పురస్కరించుకొని భగవాన్ సాయి చేసిన దివ్య ప్రసంగమునుండి)* ●

**"మనసులోని ఆలోచన, యోచన - మాటలోని సూచన, - క్రియలోని ఆచరణ మూడూ ఒకటిగా ఉండాలి"**

శ్రీ సత్యసాయిబాబా

# మహాగౌరి

శ్వేతే వృషే సమారూఢా శ్వేతాంబర ధరా శుచిః
మహా గౌరీ శుభం దద్యాన్మహాదేవ ప్రమోదదా !

దుర్గామాత యొక్క అష్టమ శక్తినామం మహాగౌరి. ఈమె పరిపూర్ణంగా గౌర వర్ణంలో ఉంటుంది. శంఖ, చంద్ర, కుంద పుష్పాలతో ఈ గౌరవర్ణం ఉపమించబడింది. ఈమె వయస్సు అష్ట వర్షాలు మాత్రమే. అష్టవర్షా భవేత్ గౌరీ ! ఈమె సర్వ వస్త్ర, ఆభరణాదులన్నీ కూడా శ్వేతంగానే ఉంటాయి. చతుర్భుజాలు కల ఈ తల్లి వాహనం వృషభము. ఈమె కుడి పైభుజంలో అభయ ముద్రనూ, కుడి క్రింది భుజంలో త్రిశూలాన్నీ ధరించి ఉంటుంది. ఎడమపై చేతిలో ఢమరుకాన్నీ, ఎడమ క్రింది చేతిలో వరదముద్రనూ ధరించి ఉంటుంది. ఈమె అత్యంత శాంతంగా ఉంటుంది.

తన పార్వతీ రూపంలో ఈమె శివదేవుని భర్తగా పొందాలని మహా తపస్సు చేసింది. (వ్రియే2 హం వరదం శంభుం నాన్యం దేవం మహేశ్వరాత్ (నారద పాంచరాత్రం) 'శివదేవుని వినా నేను అన్య దేవునెవరినీ భర్తగా వరించను.' అని సంకల్పించుకుంది. కఠోరమైన తపస్సుకు ఈమె శరీరమంతా నలలా అయిపోయింది. ఈమె తపస్సుకు ప్రసన్నుడై, సంతుష్టుడై శివదేవుడు ఈమె శరీరాన్ని గంగా జలంతో పరిశుద్ధం చేయడంతో ఈమె దేహం విద్యుత్ ప్రభా సమంగా అత్యంత కాంతిమంతంగా గౌరవర్ణంతో అలరారసాగింది. నాటి నుండీ ఈ దేవికి మహాగౌరీ నామం ఏర్పడింది.

దుర్గాపూజలో ఎనిమిదవనాడు మహాగౌరీ దేవిని ఉపాసించడం విధి అయి ఉంది. ఈమె శక్తి అమోఘమైన సద్యః ఫలదాయిని అయినది. ఈమె ఆరాధన వల్ల భక్తుల కల్మషాలన్నీ క్షాళితమైపోతాయి, వారి పూర్వ సంచిత పాపాలు కూడా క్షాళితమైపోతాయి. భవిష్యత్తులో పాప, సంతాప, దైన్యదుఃఖాదులు వారిని దరిచేరవు. మహాగౌరీ భక్తుడు సర్వవిధ పవిత్రుడై పుణ్యాధికారి అవుతాడు.

గౌరీ మాతృ ధ్యాన, స్మరణ, పూజ - ఆరాధనల వల్ల భక్తులకు సర్వవిధ శుభాలూ చేకూరుతాయి. మనం సర్వదా ఈమెను ధ్యానించాలి. ఈమె కృప వల్ల అలౌకిక సిద్ధులు లభిస్తాయి. మనస్సును ఏకాగ్రం చేసి మానవుడు సదా ఈ దేవి పాదారవిందాలనే ధ్యానించాలి. భక్తుల

**పురాణపండ రాధాకృష్ణమూర్తి**

కష్టాలను ఈ తల్లి అవశ్యం దూరం చేస్తుంది. ఈమెను ఉపాసించడం వల్ల ఆర్తజనుల అసంభవాలు కూడా సంభవమవుతాయి. కనుక ఈమె చరణాలను శరణునేడ సర్వవిధాలా ప్రయత్నించాలి. పురాణాలలో మహాగౌరీ మహిమాభివర్ణన విశేష గాధలలో సాగింది. ఈ జననీ మనుష్యవృత్తులను సత్ప్రవృత్తులవైపు ప్రేరేపిస్తూ అసద్వృత్తులను నాశనం చేస్తుంది. ప్రపత్తి భావంతో సర్వదా మహాగౌరీ దేవిని సర్వదా శరణు వేడాలి.

"మహాగౌరీ దేవికీ జై" ☆

## విదురనీతి

"గృహీవాక్యో నయవిద్ వదాన్యః
శేషాన్నభోక్తా హ్యవిహింసకశ్చ
నానర్థకృత్యా కులితః కృతజ్ఞః
సత్యోమృదుః స్వర్గముపైతి విద్వాన్"

గురువుల ఉపదేశమును స్వీకరించువాడు, ధర్మము తెలిసినవాడు, దాత, ఇతరులకు పెట్టగా మిగిలిన అన్నమును భుజించువాడు, హింస చేయని వాడు, అనర్థకరములగు పనులు చేయనివాడు, కృతజ్ఞుడు, సత్యవంతుడు, మృదుస్వభావము గలవాడును అయిన పండితుడు స్వర్గమును పొందును.

బుద్ధపూర్ణిమ సందేశం

# మతులు మంచివైన మతమేమి చెడ్డది ?

నమ్మక చెడిన వారలున్నారు కాని
నమ్మి చెడినట్టివారు ఈ లోకాన లేరు.. లేరు...

ప్రాచీన కాలమునుండి అనేకమంది మహర్షులు, మహనీయులు దైవనిమిత్తమై అనేక సాధనలు సలిపి, కాలమును సార్థకం చేసుకుంటూ వచ్చారు. బ్రహ్మజ్ఞానమును పొందగోరి, ఆత్మజ్ఞానమును ఆశించి, అనేక ప్రదేశములు సందర్శించి, మహనీయులను దర్శించి, ప్రబోధలు వింటూ వచ్చారు.

బహుళ గ్రంథ పరిచయం జ్ఞానం కానేరదు. లేక ఈ చరాచర ప్రపంచమంతయును ఒక్క తూరి గుర్తించి దానిని తెలుసుకున్నంత మాత్రమున జ్ఞానులు కాలేరు. అసలు నిజమైన జ్ఞాని ఎవరు ? సమిష్టియందు, వ్యష్టి యందు ఉండినటువంటి ఏకత్వాన్ని గుర్తించినటు వంటివాడే నిజమైన జ్ఞాని. కాని ఈనాడు మానవుడు తనయందున్న మానవత్వాన్నే గుర్తించుకోలేని పరిస్థితులలో ఉన్నాడు. మానవత్వాన్నే గుర్తించుకోలేనటువంటి వ్యక్తి దైవత్వాన్ని ఏరీతిగా గుర్తించగలడు ? కనుకనే తరములు కదలినా, యుగములు మారినా మానవుడు తన తత్వమును మార్చుకొనుటకు ఏమాత్రం ప్రయత్నిం చడంలేదు. ఆత్మజ్ఞానమునుగాని, బ్రహ్మజ్ఞానమునుగాని గ్రంధములు మనకు ఏమాత్రం బోధించలేవు. లేక మహనీయులెవరూ మనకు అందించలేరు. గురువులు బోధించలేరు. కారణం? జ్ఞానం, ఆత్మతత్వము. బాహ్య ప్రపంచమందు మనకు కానరాదు. ఇది తన హృదయము నుండియే ఆవిర్భవించాలి. కనుక తనయందే ఉండినటువంటి జ్ఞానత్వము కోసం బయటవెదకటమే ఒక పెద్ద అజ్ఞానం. బుద్ధుడు కూడా ఆదిలో అన్ని గ్రంధములూ చదివాడు. మహనీయులను దర్శించాడు, వారి ప్రబోధలు చక్కగా శ్రవణం చేశాడు. కాని ఇవన్నీ నిజమైన జ్ఞానమును అందించలేవనే సత్యాన్ని కట్టకడపటికి గుర్తించాడు. తనయందే నిగూఢముగానున్న జ్ఞానమును గురించి, తనయందే అజ్ఞాతంగా నిలిచివున్న ఈ జ్ఞానమును గురించి బాహ్య ప్రపంచమున ఉన్న వ్యక్తులు ఏ రీతిగా బోధించగలరు ? కనుక తన జ్ఞానమును, తన ఆత్మానందమును తానే గుర్తించాలని గొప్ప తపస్సు చేశాడు బుద్ధుడు. తన దృష్టిని అంతర్ముఖం గావించాడు. బహిర్ముఖ దృష్టిని పూర్తిగా స్తంభింపజేశాడు. క్రమేణా తననుండి ఒకే ఆత్మజ్ఞానం ఆవిర్భవిస్తూ వచ్చింది. అప్పుడే "బుద్ధం శరణం గచ్ఛామి", "సంఘం శరణం గచ్ఛామి", "ధర్మం శరణం గచ్ఛామి" అన్నాడు. అనగా తన యందున్నటువంటి ఆత్మజ్ఞానమును బుద్ధి ద్వారా తాను



వినియోగించుకున్నాడు. బుద్ధి ద్వారా ఆవిర్భవించి నటువంటి జ్ఞానమును సంఘములో ప్రవేశపెట్టాడు. సంఘములో ప్రవేశపెట్టినటువంటి ఈ జ్ఞానమును ధర్మము ద్వారా ఆచరించడానికి ప్రయత్నించాడు. కనుక మానవుడు జ్ఞానమును గ్రంధ పరిచయం ద్వారా ఏనాటికినీ పొందలేడు. ఇవన్నీ కాలమును వ్యర్థంగావించే పనులే. అంతఃకరణమును పరిపూర్ణముగా అభివృద్ధి గావించు కొనినప్పుడే ఆత్మజ్ఞానము మనకు లభ్యమవుతుంది. సమస్త శక్తులూ మానవుని అంతఃకరణమునందే యిమిడి ఉంటున్నాయి. అయితే మానవుడు అనేక చదువులు చదువుతున్నాడు. ఈ చదువుల ద్వారా జ్ఞానము లభిస్తుందని ఆశిస్తున్నాడు. ఎన్ని సాధనలు చేసినా ప్రయోజనం కనిపించడంలేదు.

"న తపాంసి, న తీర్థానాం
న శాస్త్రానాం జపాన హి
సంసార సాగరోద్ధారే
సజ్జనం సేవనం వినా"

తపస్సు ద్వారా, ధ్యానం ద్వారా, జపం ద్వారా ఈ ఆనందం మనకు లభ్యంకాదు. ఇవన్నీ కాలం సద్వినియోగం గావించు నిమిత్తమై ఏర్పడిన సత్కర్మలు మాత్రమే. మానవుని హృదయమునందు ఉండినటువంటి శక్తి మరే ప్రదేశమునా కానరాదు. మానవుని యందు

అనేక విధములైన అజ్ఞాత శక్తులు యిమిడి ఉంటున్నాయి. మానవుని యొక్క శరీరమే ఒక పెద్ద 'జనరేటర్'. మానవుని యొక్క హృదయము ఒక పెద్ద 'మాగ్నెట్'. మానవుని యొక్క ఆలోచనా శక్తియే ఒక పెద్ద 'కరెంటు'. ఈ విధమైనటువంటి సర్వశక్తులూ మానవునియందు యిమిడి ఉంటున్నాయి.

భగవంతుడు ప్రసాదించిన ఐదు కర్మేంద్రియాలను, ఐదు జ్ఞానేంద్రియములను చక్కగా సద్వినియోగం చేసికొన్నప్పుడే ఆనందం లభిస్తుందని విశ్వసించాడు బుద్ధుడు. కనుక మొట్టమొదట 'సమ్యక్ దృష్టి' కి ప్రాధాన్యతనిచ్చాడు. మనం దేనిని చూస్తామో ఆ చిత్రము మన హృదయంలో ముద్రించబడుతుంది. కనుక మనం చెడ్డ దృశ్యములను చూడరాదు. మంచి దృశ్యములను మాత్రమే చూడవలెను. దృష్టి ఎట్టిదో సృష్టి అట్టిది. కనుక మనం 'సమ్యక్ దృష్టి'ని ఈనాడు అభివృద్ధి పరచుకోవాలి. సమ్యక్‌దృష్టికోసం 'సమ్యక్‌సంఘం' ఉండాలి. మానవునికి ఈ'సమ్యక్‌సంఘం' ఏర్పడినప్పుడే 'సమ్యక్‌కర్మ' ఏర్పడుతుంది. మనం ఈనాడు దుష్టసంగమంతో చేరి, దుర్మార్గులతోచేరి, దుష్ప్రవర్తనా పరులమై మన జీవితమును అనేక విధముల పాడు చేసుకుంటున్నాం.

**"త్యజ దుర్జన సంసర్గం**
**భజ సాధు సమాగమం**
**కురుపుణ్యమహోరాత్రం**
**స్మర నిత్యం అనిత్యతామ్"**

మొట్టమొదట మనం సత్సంగాన్ని అభివృద్ధి పరచుకోవాలి. సత్సంగమనగా ఏమిటి? శాశ్వతమైన, త్రికాలబాధ్యమైనటువంటి తత్త్వమునే సత్సంగమంటారు. ఏదో పదిమంది మంచివారితో చేరటం సత్సంగమం కాదు. 'సత్' అనగా శాశ్వతము. ఎలాంటి పరిస్థితులయందు మార్పుచెందనటువంటిది. అదియే దైవత్వం, కనుకనే దైవత్వాన్ని "సత్, చిత్, ఆనందం" అన్నారు. అట్టి సచ్చిదానంద స్వరూపుని యొక్క సంఘంలో మనం ప్రవేశించాలి. అట్టి 'సమ్యక్‌దృష్టి' మనం పోషించుకోవాలి. అట్టి 'సమ్యక్‌దృష్టి' వలననే 'సమ్యక్‌భావం' మనలో అభివృద్ధి అవుతుంది. ఆ 'సమ్యక్ భావం' మనలో ఆవిర్భవించినప్పుడే 'సమ్యక్ శ్రవణం' మనలో ఏర్పడుతుంది. 'సమ్యక్‌శ్రవణం' ఏర్పడినప్పుడే 'సమ్యక్‌కర్మ'లు మనం చేస్తుంటాం. కనుక త్రికరణశుద్ధికి ఈ మూడూ అత్యవసరం. దీనిని మానవత్వం అని చెబుతూ వచ్చారు. The Proper Study of Mankind is Man అన్నారు. ఏమిటి ఈ Proper Study of Mankd? పవిత్రమైనభావములు, పవిత్రమైన పలుకులు, పవిత్రమైన కర్మలు. ఈ మూడింటియొక్క ఏకత్వంచేతనే 'త్రికరణశుద్ధి' ఏర్పడుతుంది. ఈ 'త్రికరణ శుద్ధి'తో వచ్చినటువంటి తత్త్వమే నిజమైన దైవత్వము. కనుక మన భావములు, మన పలుకులు, మన పనులు- ఈమూడింటి యొక్క ఏకత్వంచేతనే మానవుడు తనదివ్యత్వాన్ని తాను తెలుసుకోగలడు. ఈ సత్యమును గ్రహించిన బుద్ధుడు కట్టకడపటికి ఆనందమును పొందగలిగాడు.

బుద్ధుడు పుట్టిన తొమ్మిదవ దినాన తల్లియైన మాయాదేవి మరణించింది. తరువాత పినతల్లి గౌతమి ప్రేమతో సాకింది. కనుకనే బుద్ధునికి 'గౌతమ' అని పేరు పెట్టారు. ఆత్మబోధలు జరిపే వారు ఈ జగత్తులో అనేకమంది కనిపిస్తుంటారు. కాని ఒక్కరైనా ఆచరించి ఆనందించినవారు కనిపించటంలేదు. కనుక ఎన్ని తెలిసికొని ఏమి ప్రయోజనం? ఎన్నిగ్రంధములు చదివి ఏమి ప్రయోజనం? ఆచరణలో పెట్టలేని చదువులు అన్నీ వ్యర్థములే. నీ కాన్షస్ (ఆత్మ) ను నీవు అనుసరించు. అదియే నీ నిజమైన తత్త్వము. అదియే నీ నిజమైన గురువు. బుద్ధుడు ఈ విధంగా ఆలోచిస్తూ సర్వమూ తన నుండియే అభివృద్ధి పరచుకుంటూ వచ్చాడు.

నిర్వాణ సమయమునందు తన పినతల్లి కుమారుడు ఆనంద్ ఎదురుగా కూర్చొని కంటినీరు పెడుతూ వచ్చాడు. అతనిని దగ్గరకు తీసుకొని "ఆనందా! ఈనాటి వరకు జగత్తు సత్యమును గుర్తించు కోలేకపోయింది. మరణించేవారిని చూచి దుఃఖించేవారు కోకొల్లలు. కాని ఆ మరణించేవ్యక్తి ఏపవిత్రమైన స్థితిని పొందుతున్నాడో అనే సత్యమును మాత్రము విచారించ లేకపోతున్నారు. నేను ఆ సత్యమును గుర్తించాను. నేను ఆ సత్యములో లయమైపోతున్నాను. దీనిని నీవు చూచి కంటినీరు పెట్టటం ఎంతఅన్యాయం? నా పవిత్ర స్థితికి నీవు దుఃఖించినట్లు కనిపిస్తున్నది. మానవులు ఎవ్వరూ అంత్యసమయంలో కంటిధారలు కార్చకూడదు.

"నారములు అనగా నీరు. 'నయనములు' అనగా కన్నులు. కన్నులలోని నీరు కేవలం

నారాయణునికి మాత్రమే వదలాలి. కాని అన్య పదార్థములకుగాని, అన్యవిషయములకుగాని ఏమాత్రం మనయొక్క 'నారములు' వదలరాదు. దైవత్వమునకై మనయొక్క ఆనందభాష్పములు వదలాలి. కాని శోకభాష్పములు వదలటం మానవునికి ధర్మంకాదు. ఒకే బజారులో ఒకడు ఏడుస్తుంటాడు, మరొకడు ఆనందంతో గంతులు వేస్తుంటాడు. ఎవరైనా సరే ఏడిచేవాడి దగ్గరకువెళ్ళి ఎందుకు ఏడుస్తున్నాడో విచారిస్తారుగాని, ఆనందంతో గంతులువేసేవాని వద్దకు వెళ్ళి ఎందుకు ఆనందంగా ఉన్నావని ఎవరూ అడుగరు. కారణం? ఆనందం మానవుని సహజప్రవృత్తి. మానవుడు ఆనందపిపాసి. దుఃఖము మానవునికి విరుద్ధమైనది. మానవుడు ఏ విషయంలోనూ దుఃఖించడానికి ప్రయత్నించ కూడదు. దుఃఖము ఒక బలహీనత. దుఃఖమునకు ఏ మాత్రం అవకాశం ఇవ్వకూడదు. దైవత్వాన్ని చక్కగా విశ్వసించినవానికి దుఃఖమే లేదు. దుఃఖించేటటు వంటివాడు దైవత్వాన్ని పరిపూర్ణంగా గుర్తించలేదని భావించాలి. దైవం ఒక్కడే. అనేకరూప నామములచేత మనకు గోచరిస్తున్నాడు. కాని దైవం ఒక్కడే. అట్టి దివ్యత్వాన్ని మనం ఒక్కటిగా గుర్తించుకోలేకపోవటంచేతనే అనేక విధములైన అపోహలకు గురిఅవుతున్నాం. రామ! కృష్ణ! బుద్ధ! అల్లా! ఏసు! ఇలాంటి పేర్లతో మనం ఆరాధన చేస్తున్నాం. ఇవి పెట్టిన పేర్లేగాని పుట్టిన పేర్లుకావు. కనుక పెట్టిన పేర్లు, మనం అనుభవించేటటువంటి అనుభూతులు ఆధారమని భావిస్తున్నాం, ఇవన్నీ క్షణ భంగురాలు. నీటిబుడగపై నిలచిన ఈ దేహం ఎంతకాలం ఉండగలదు. మనకు కావలసింది ఆనందం. అదే సత్యమైనటువంటిది. అయితే ఆనందం ఎక్కడ నుంచి వస్తుంది? ఈ సంతోషమనేటటువంటిది సర్వమునూ తెలుసుకున్నవారికే లభ్యమవుతుంది. Happiness is Union With God. ఈ సంతోషం బయట ప్రపంచంలో లభ్యమయ్యేటటువంటిది కాదు. దీనిని ఎవ్వరూ అందించలేరు. తనను తానే అభివృద్ధి పరచుకోవాలి. ఇట్టి అభివృద్ధి పరచుకోవలసిన ఆనందాన్ని ఏదో ఎవరివద్దనో పొందుదామని ఆశించడమే పెద్ద అజ్ఞానము. ఈ విధమైన అజ్ఞానమునకు చాలా బాధ పడ్డాడు బుద్ధుడు. కట్టకడపటికి బుద్ధగయకు వెళ్ళాడు. అక్కడ తనయందున్నటువంటి అంతర్భావము యొక్క ఆనందాన్ని ఆవిర్భవింప జేసుకోవాలని సంకల్పించుకున్నాడు. అక్కడనే ఈ ఆనందాన్ని అభివృద్ధి పరచుకున్నాడు. ఎవ్వరూ దీనికి బాధ్యులు కారు. ఒకరు ఇచ్చేటటువంటిది కాదు. ఒకచోటనుంచి తెచ్చుకొనేటటువంటిదికాదు. అసలు తనయందే ఉన్నటువంటి ఆనందాన్ని మరచి, అనేకచోట్ల వెతుకుతున్నాడు. ప్రతి మానవుని హృదయస్థానమే భగవంతుని స్థానము. అట్టి స్థానమును మన జన్మ స్థానముగా విశ్వసించి, దానిని అభివృద్ధి పరచుకోవటానికి ప్రయత్నించాలి. చెప్పినది ఆచరించటానికి ప్రయత్నించాలి. తెలుసుకున్న సత్యమును ఆచరణలో పెట్టాలి. అప్పుడే మనకుసరియైన సత్యం గోచరిస్తుంది. అయితే ఈనాడు తెలుసుకున్నటువంటి విషయాలను నిత్యజీవితంలో అనుభూతిలోనికి తెచ్చుకోవటంలేదు. కనుకనే ఈనాడు ప్రపంచం ఇన్ని అవస్థలకు గురి అవుతూ వస్తున్నది. దైవత్వం కోసం వెతకనవసరం లేదు. ప్రతి ఒక్కరి హృదయమునందూ నిత్యం ప్రకాశిస్తూనే ఉన్నది. ఆ ప్రకాశవంతమైన దివ్యజ్యోతియే దైవత్వము. ఎక్కడో బయట ప్రపంచమున లేదు.

## కలిమి - చెలిమి

*బాల్యమిత్రుడైన బడుగు కుచేలుని*
*లేమి బాపె శౌరి ప్రేమ జూపి*
*అడ్డు గాదు కలిమి అసలైన చెలిమికి*
*తెలిసి నడచుకొనుము తెలుగుబిడ్డ!!*

*ఐన వారి కెంత ఐశ్వర్యమున్నను*
*తనదు లేమి తనకు తప్పబోదు*
*శివుడు బిచ్చమెత్తె శ్రీహరి తోడయ్యు*
*తెలిసి నడచుకొనుము తెలుగుబిడ్డ!!*

*పాలతీపి పెంచ పంచదారకె చెల్లు*
*ఉన్న రుచిని విఱచు ఉప్పుగల్లు*
*మనసు గలిసినపుడె మైత్రికి అందంబు*
*తెలిసి నడచుకొనుము తెలుగుబిడ్డ!!*

*పంటచేలయందు పక్షులు గుంపులే*
*పంటలేనినాడు కంట బడవు*
*కలిమి లేక రారు చెలిమిగోరెడు వారు*
*తెలిసి నడచుకొనుము తెలుగుబిడ్డ!!*

- ఏకా రామచంద్రరావు

"దేవుడనగ వేరు దేశమునందున లేడు
తాను చేయు పనుల దగిలి యుండు
పాపమనగ వేరు పరదేశమున లేదు
తాను చేయు పనుల దగిలి యుండు"

పుణ్యంగాని, పాపంగాని మన కర్మలయందు ఇమిడి ఉంటున్నదేగాని ప్రత్యేకంగా ఎక్కడనుంచో వచ్చేటటువంటిదికాదు.

"మతులు మంచివైన మతమేమి చెడ్డది?" ఈనాడు మతం చెడ్డదనే వారి మనసే చెడ్డది. కనుక ఈనాడు మనసును పవిత్రంగా ఎంచుకోవాలి. మనసును సక్రమమైన మార్గంలో ప్రవేశపెట్టాలి. 'సమ్యక్‌దృష్టి' లో దీనిని ప్రవేశపెట్టాలి. 'సమ్యక్‌భావం' లో దీనిని ఆరితేర్చాలి. 'సమ్యక్ శ్రవణం' చేయాలి. 'సమ్యక్‌కర్మ' లను ఆచరిస్తూ రావాలి.

బుద్ధుడు చెప్పినవి ఐదే ఐదు కర్మలు. 1. సమ్యక్ దృష్టి 2. సమ్యక్ భావము 3.సమ్యక్‌శ్రవణం 4. సమ్యక్ వాక్కు 5.సమ్యక్‌కర్మ. ఈ ఐదింటి ద్వారానే పంచ భూతములు సక్రమంగా పని చేస్తాయి. దైవం ఇచ్చిన ఈ పంచభూతములను సార్థకం గావించుకోవటమే నిజమైన సాధన. కాని భగవంతుడు ఇచ్చిన మతి, స్థితి, గతి, సంపత్తులను ఈనాడు దుర్వినియోగం చేసుకుంటున్నాం. ఈ కామక్రోధలోభమోహమద మాత్సర్యములను అభివృద్ధిపరచుకుంటున్నాం. ఈ అరిషడ్వర్గములు భగవంతుడు ఇచ్చినవి కావు. తిండి తీర్థాలతో మనం పెంచుకున్నటువంటివే. ఇవన్నీ కేవలం మృగ లక్షణాలు, పశులక్షణాలు. వీటిని మనం పవిత్రం గావించాలి. దివ్యమైనటువంటి దైవలక్షణాలను మనం పోషించుకోవాలి. సత్యంగా జీవించాలి.

"సత్యంబ్రూయాత్
ప్రియం బ్రూయాత్
నబ్రూయాత్ సత్యమప్రియం
ఏషః సనాతన ధర్మః

సత్యంబ్రూయాత్-ఇదే గౌరవమైనజీవితం, ఇదే నైతికజీవితం. ప్రియంబ్రూయాత్-ఇదే దైవికమైనటు వంటిది. నబ్రూయాత్ సత్యమప్రియం- ఇదే ఆధ్యాత్మిక మార్గం. కనుక నైతిక, ధార్మిక, ఆధ్యాత్మిక మార్గములన్నియూ సత్యములోనే ఇమిడి ఉంటున్నాయి.

"సత్యంబునందుండే సర్వంబుసృష్టించె
సత్యంబు నందణగె సర్వసృష్టి
సత్యమహిమలేని స్థలమేది కనుగొన్న
శుద్ధసత్యమిదియె చూడరయ్య!"

భారతీయ సంస్కృతి యందు 'సత్యంవద' 'ధర్మంచర' అన్నారు. ఎలాంటి పరిస్థితులయందైనను సత్యమును మనం పలకాలి. సత్యమే దైవము. సత్యమే ప్రత్యక్షదైవము. ధర్మము మనకు పరోక్షమైన నీడ. ఈ రెండింటిని ఆధారం చేసుకున్నప్పుడు మనం దివ్యత్వాన్ని చక్కగా దర్శించవచ్చును. మానవుని యందే సర్వశక్తులూ ఇమిడి ఉన్నాయి. తన దృష్టిని అంతర్ముఖం గావించు కున్నప్పుడు ఆనందంగా తాను జీవించగలడు. అయితే ఈనాడు దురదృష్టవశాత్తు మన దృష్టిని బహిర్ముఖం గావించుకుంటున్నాం. కనుకనే వేదం చెప్పింది 'పశ్యతీతి పశుః' బహిర్‌దృష్టి పశులక్షణము. పశులక్షణాలను దూరం చేసుకున్నప్పుడు మనలో పశుపతి లక్షణాలు ఆవిర్భవిస్తాయి. దివ్యమైన భావాలు మన హృదయంలో ఆవిర్భవింప జేసుకోవాలి. దైవముకంటే మించినది జగత్తులో మరొకటి లేదు. దివ్యమైన భావాలు ఎన్నో జన్మల సుకృతం చేత లభ్యమవుతుంటాయి. కనుక దైవత్వం అనేటటువంటిది పవిత్రమైనటువంటిది. మిగతావన్ని వస్తుంటాయి, పోతుంటాయి. ఇవేవీ సత్యములుకావు. ఏవీ శాశ్వతంగా ఉండవు. అశాశ్వతములే, వస్తుంటాయి, పోతుంటాయి. కాని వచ్చి పెరిగేటటు వంటిది ఒక్కటే. అది దైవత్వమే. ప్రాపంచిక సంపద Comes and Goes (వస్తుంటుంది, పోతుంటుంది) దివ్యత్వం మాత్రం Comes and Grows (వస్తుంది మరియు పెరుగుతుంది). ఆ దివ్యత్వాన్ని మనం ఈనాడు పవిత్రం గావించుకోవాలి.

ప్రేమస్వరూపులారా!

ఈ బుద్ధపూర్ణిమయొక్క ఆనందాన్ని అనుభవించాలని ఎంతో దూరంనుంచి మీరు ఇక్కడకు వచ్చారు. ఇంతదూరం మీరు రానవసరంలేదు. బుద్ధుడనగా మీ బుద్ధియొక్క స్వరూపమే. అందువలన ఆ బుద్ధిని సక్రమమైన మార్గంలో పెట్టుకోవాలి. ఆ బుద్ధిని సక్రమమైన మార్గంలో పెట్టుకున్నప్పుడే "బుద్ధిస్టు" అనే నామం సార్థకమవుతుంది. కేవలం సాధనలు...సాధనలు.. అని మన కాలమునే వ్యర్థము గావించుకుంటున్నాం. పవిత్రమైన భావాలను అభివృద్ధి పరచుకోండి, దుష్ట

గుణములను దూరంచేసి, సద్గుణములను పెంచుకోవటమే నిజమైన సాధన. కనుక ఏరంగానికి వెళ్ళినా మీలోని చెడ్డగుణాలను విసర్జించండి. పవిత్రమైన భావాలను పెంచుకోండి. దివ్యమైన, భవ్యమైన భావాలు పెంచుకోవాలి.

నిర్వాణమనగా ఏమిటి? అదియే మోక్షము, అంత్యసమయమందు ఆనందాన్ని అనుభవించడమే 'నిర్వాణము'. కాని ఈనాటి మానవుడు ఈ సత్యమును గుర్తించడానికి ప్రయత్నించడంలేదు. దేనిని పొందాలో! దేనిని విసర్జించాలో! తెలుసుకోలేకపోతున్నాడు. మనం ముఖ్యంగా రెండు విషయాలను గుర్తులో పెట్టుకోవాలి. నీవు పరులకు చేసిన ఉపకారము, పరులునీకు చేసిన అపకారమును మరిచిపోవాలి. ఆవిధంగా మరచి పోవాల్సినవి మరచిపోవాలి, జ్ఞప్తియందుంచుకోవలసినవి జ్ఞప్తి యందుంచుకోవాలి. ఏది జ్ఞప్తి యందుంచు కోవాలి. ఇతరులు మనకు చేసిన ఉపకారం. ఏది మరచి పోవాలి? ఇతరులకు మనం చేసిన ఉపకారం. పవిత్రమైన భావంతో మనకు ఉపకారం చేసిన వారికి కృతజ్ఞతలు చెప్పాలి. అసలు ఈ కృతజ్ఞతల కోసమే మానవజీవితం వచ్చింది. 'శరీర మాద్యం ఖలు ధర్మ సాధనమ్'. ధర్మమును ఆచరించాలి. అదిలేకపోతే మనకు శరీరమే అవసరంలేదు. ఏకర్మ నాచరించినా ధర్మకార్యంగా భావించాలి. ప్రతికర్మనూ ధర్మకర్మలుగానే విశ్వసించాలి. ఈవిధమైన భావాలను మన హృదయంలో అభివృద్ధి పరచుకోవాలి. దైవాన్ని చింతిస్తూ ఏ కర్మలు చేసినా అన్నీ పవిత్రమైపోతాయి. దీనినే 'సర్వకర్మ భగవత్ ప్రీత్యర్థమ్' అన్నారు. కనుక మొట్ట మొదట మనం ఈనాడు 'సమ్యక్‌దృష్టి' ని పెంచుకోవాలి. చెడ్డభావములు మనలో రాకుండా చూచుకోవాలి. చెడ్డను చూస్తే మన హృదయంలో వాటి ముద్రలు పడిపోతాయి. కాబట్టి మంచిని చూస్తూ పోదాం. మంచిని పలుకుతూ పోదాం. ఇదే మన జీవితానికి అంత్యము.

See No Evil
See What is Good
Hear No Evil
Hear What is Good
Talk No Evil
Talk What is Good
Think No Evil
Think What is Good
Do No Evil
Do What is Good
This is way to God.

ఈ విధమైనవాటిని అనుసరించకుండా, ఎప్పుడూ Bad Look (చెడ్డదృష్టి), Bad Hear (చెడు వినటం), Bad Talk (చెడ్డమాటలు), Bad Thoughts (చెడ్డ ఆలోచనలు), Bad Actions (చెడ్డపనులు) - ఎప్పుడు నీవు తరించేది? బుద్ధుడు బోధించిన ఐదు మార్గములను (సమ్యక్‌దృష్టి, సమ్యక్‌భావం, సమ్యక్‌శ్రవణం, సమ్యక్‌వాక్కు, సమ్యక్ కర్మ) అనుసరిస్తే ఇంతకన్నా మోక్షం మరొకటి లేదు. ఇదియే పవిత్రమైన నిర్వాణము. నిర్వాణమంటే ఏమిటి? మానసిక శాంతిలో తాను లీనమైపోవటమే. ఏది మానసిక శాంతి? అసలు శాంతి హృదయశాంతే. హృదయం అంటే Physical Heart కాదు. హృదయం అనేది ప్రత్యేకమైనది. అది హృదయమే. ఇది Heart కాదు. Physical Heartను Heart అంటారు. దీనిని హృదయం అంటారు. హృత్+ దయ=హృదయం. Compassion (దయ) గా ఉండినటు వంటిదే హృదయము. హృదయం ఎప్పుడూ 'దయ'తో నిండి ఉండాలి. కరుణతో నింపి ఉండాలి, ప్రేమతో నిండి ఉండాలి, అప్పుడే నీ హృదయం పవిత్రమైన మార్గంలో ప్రవేశిస్తుంది.

**ప్రేమస్వరూపులారా!**

మనయందే ప్రేమస్వరూపుడై పరమాత్మ నిరంతరం ఉంటున్నాడు. ప్రేమకు మించినది మరొకటి మనకు లేదు, ప్రేమనే దైవము, దైవమే ప్రేమ. అట్టి ప్రేమ స్వరూపుణ్ని మనం సరియైన దృష్టిలో పెట్టుకొనినప్పుడే అదే 'సమ్యక్‌దృష్టి' అవుతుంది. కనుక ప్రేమచేతనే మన జీవితాన్ని గడుపుదాం.

ప్రతిదానికి ప్రాక్టీస్ (అభ్యాసం) చేయాలి. ఆధ్యాత్మికంలో ఏమి ప్రాక్టీస్ చేయాలి? దుర్గుణాలను దూరం చేసుకోవాలి. సద్గుణాలను పోషించుకోవాలి. చెడ్డ భావాలను మరచిపోవాలి. మంచిభావాలను పెంచు కోవాలి. ఇదే నిజమైన సాధన. మన భావాలను మనం మార్చు కోవాలి. పశుభావాలను దూరంచేయాలి. దివ్య భావాలను మనం పెంచుకోవాలి. ఇవన్నీ రావాలంటే ప్రేమ ఒక్కటే దీనికి మార్గం. కనుక ప్రేమ చేతనే జీవించండి!

*(ది 10.5.1998న బృందావనంలో భగవాన్ సాయి చేసిన బుద్ధపూర్ణిమ దివ్యప్రసంగమునుండి)* ■

# సామీప్యముక్తి

(2వ భాగం)

"ఒక విశిష్టమైన ఆశయం కోసం పుట్టినా, అటువంటి జీవితాశయాన్ని గుర్తించలేకపోవటం. లోపల ఇంద్రియాతీతమైన ఒక దివ్యమైన ఆత్మశక్తి ఉన్నా బాహ్యమైన, భౌతికమైన ఇంద్రియాలకు లోనై పరిమితమైన, అల్పమైన శక్తితో తనకుతాను పరిమితుడై నిరంతరం బాహ్యాభ్యంతరాల స్పర్ధతో బ్రతకటం, ఎంత ఎత్తుకు ఎదగాలో అంతకు విపరీతంగా అతడు అగాధాల్లోకి దిగజారి పోవటం : కాస్సేపు రాగంవైపు, కాస్సేపు ద్వేషంవైపు ఆకర్షింపబడుతూ రాగద్వేషాలకులోనై ఊగిసలాటలో కొట్టుకొని పోవటం: "స్వేచ్ఛ స్వేచ్ఛ అంటూనే నిజమైన స్వేచ్ఛ అనేది ఏమిటో తెలుసుకోలేక బంధంలోనే బ్రతకటం: చీకటిని చూడనిదే వెలుగంటే ఏమిటో తెలియక వెలుగుకై కలలు కంటూ చీకటిలోనే జీవితాన్ని గడపటం, దివ్యానందలేశాన్ని చవి చూడాలని బాధానుభవాన్ని వెంట తెచ్చుకోవటం, అమరత్వాన్ని ఆశిస్తూ కూడా మృత్యు ముఖంలోకే ప్రవేశించటం, అనేకమైన ఆకర్షణలకు లొంగిపోతూ కనిపించిన ప్రతి ఆకర్షణ వెంట పరుగులు తీస్తూ చివరకు బయలుదేరిన చోటులోనే మిగిలిపోవటం, పుట్టు గ్రుడ్డివాని వలె అలవాటు ప్రకారమే బ్రతకటం తప్ప ఆంతర్యాన్ని దర్శించలేకపోవటం, జీవితానికి సఫలత అంటే ఏమిటో గుర్తించలేని బ్రతుకును బ్రతకటం- ఇదే సాధారణ మానవ జన్మయొక్క లక్షణం- ఈ ప్రపంచంలో తాను ప్రవేశించినప్పుడు ఈ ప్రపంచం ఎలా ఉందో, ఈ ప్రపంచం నుంచి తాను వెళ్ళే సమయంలో కూడా ఈ ప్రపంచాన్ని అదేరీతిగా మిగుల్చుతోంది మానవజన్మ!! "

ఇది మానవ జీవితాన్ని గూర్చి శ్రీఅరవింద మహాయోగి తమ అమరకావ్యం "సావిత్రి" లో ఆంగ్లంలో వ్రాసిన పంక్తులకు గల భావం ! (SAVITRI - BOOK III, CANTO IV.)

## మనిషి మేలుకోవాలి:

'తన గృహమున నభ్యాసం
బున మెలగెడు నందు చందమున సంసారం
బున విరుగు మూఢు డురుగడు
వినుతంబగు మోక్షపదము విమల వివేకా"

*(శాంతిపర్వము 5-532)*

మహాభారతం చెప్పే రీతిగా (ఇటువంటి మానవ జీవితంలో అజ్ఞాన నిద్రనుంచి మేల్కొని, ప్రతి మనిషి విజ్ఞాన,సుజ్ఞాన, ప్రజ్ఞానముల ప్రకాశంలో జాగృతుడై బ్రతకాలి.

"ఉత్తిష్ఠ! జాగ్రత! ప్రాప్యవరాన్నిబోధత"

'ఓ మానవులారా! మేల్కొనండి, నిద్రనుంచి లేవండి, శ్రేష్ఠులైన వారిని ఆశ్రయించి, వారిద్వారా ప్రబోధలను పొందండి', అంటుంది కఠోపనిషత్తు. ARISE, AWAKE, STOP NOT TILL THE GOAL IS REACHED అంటారు శ్రీవివేకానందస్వామి.

## పాతూరి ప్రసన్నం

"అర్జునా! లే! యుద్ధంచేసి, విజయుడవై కీర్తిని వరించు" అంటాడుశ్రీకృష్ణ భగవానుడు, భగవద్గీతలో.

మన బ్రతుకంతా ఒక మోహరాత్రి. ఈ బ్రతుకులో మనం మేల్కొని ఉన్నామని అనుకుంటూ ఉన్నప్పటికీ, అది మోహనిద్రలో మునిగి ప్రవర్తించటం వంటిదే, అని"దేవీమాహాత్మ్యం"వివరిస్తుంది!

మనల్ని ఎన్నెన్నో మోహాలు వశం చేసుకుంటున్నాయి అనేది ఎవరికి వారే గుర్తించవలసిన పరమసత్యం!

ఇలా మనల్ని విమోహపరచేదే మనస్సు!

చెడు అని తెలిసీ, దానిని విడనాడలేక, అటువంటి చెడును "మంచి" అని బ్రతికిస్తుంది మనస్సు. "బాగుపడే మార్గం ఇది" అని తెలిసీ, ఆ మార్గంలో సాగిపోనీయక పురుషప్రయత్నాన్ని పెడమార్గాన పట్టిస్తుంది

మనస్సు ! తెలిసిన మంచిని ఆచరించనివ్వదు, తెలిసిన చెడును విడనాడనివ్వదు-మనస్సు! ఇదే మహామాయా శక్తియొక్క నిత్యనిరంతర అనంత కార్యక్రమం అని త్ర [illegible] ం" వివరిస్తుంది.

మహాప్రవక్తలు, మహాపురుషులు, మహాజ్ఞానులు, మహాభక్తులు, నిస్వార్ధ సేవాపరాయణులూ అయిన వారు ఇటువంటి స్థితి నుంచి మనస్సును వేరుచేస్తారు! మనస్సును మేల్కొలిపి గమ్యంవైపు నడిపించుతారు! మనకుగల ఆధ్యాత్మిక సంప్రదాయంలో మనిషిని మేల్కొల్పే గీతాలు ఎన్నో ఉన్నాయి! పశుప్రాయమైనదిగా మానవ జీవితాన్ని గుర్తించి, అటువంటి పశుత్వం నుంచి మానవుని మేల్కొలిపి దివ్యత్వంవైపు నడిపించి, గమ్యాన్ని చేర్చటమే భారతీయ సంస్కృతిలోని ఆంతర్యం!

ఒక సంప్రదాయ కీర్తన ఇది:-

"మేలుకొనుడీ సుజనులారా! మేలుకొనుడీ సుజనులారా!
మేలుకొనుడీ మోహనిద్రనుపోలి చెడకండీ" 'మేలుకొనుడీ'

దేవదేవుని కరుణచే గద
దొరికె మనకీ మనుజ దేహము
పావనంబుగ నతని గొల్చుట
పరమ ధర్మముగా!"
కావునను మనసునకు వాక్కుల
కర్మలను కపటంబు విడిచి
సేవ చేయగ నెల్ల వారును
శీఘ్రముగ రండీ!" - మేల్కొనుడీ

మాతృగర్భములోన తొమ్మిది
-మాసములు వసియించి ఎటులో
భూతలంబున బడితి మిటు మన
- పుణ్యవశమునను!
పాతకంబు విడిచి నిర్మల
- భావమున హరి భజన చేసిన
మాతృగర్భము రాదు మనకిక
-మరిమరియు వినుడీ॥మేలు॥
ఎన్నిజన్మము లెత్తినారమో
-కెందరైరో తల్లిదండ్రులు
ఎన్నిజన్మము లెత్తవలెనో
-ఎరుగరాదహహో!
కన్ను తెరచి హరిన్భజించిన
-గలుగబోదిక జన్మబంధము
తిన్ననగు త్రోవ ఇది వేరొక
-తెరువులేదుసుడీ ॥మేలు॥

తనువు నిత్యము కాదు భూమియు
-ధనము ధాన్యములస్థిరంబులు
వనితయును దనయులును మిత్రులు
- మనకు తోడ్పడరు
తనువు పోయిన పిదప శాంతిని
-మనకు కూర్చెడు సాధనంబా
వనజ నేత్రుని భక్తియే సుడి
-మనమునను గనుడీ! ॥మేలు॥
రాజసంబున సకల భూతవి
-రాజితుండగు హరిని గానక
గాజుపూసను బోలు మెయికై
-కాని పనులెన్నొ!
రోజు రోజునను జేసి పాపపు
-రొంపిలోబడి పొరల నేటికి
రాజవందితుడైన భజనస
-మాజ వరదుని భజన సేతము
॥మేలు॥

ఇది సంప్రదాయక కీర్తన! ఇందులో ఎన్నో నిత్య సత్యాలున్నాయి!

"కామఃక్రోధశ్చ లోభశ్చ దేహే తిష్ఠన్తి తస్కరా!
జ్ఞాన రత్నాపహారాయ తస్మాత్ జాగ్రత జాగ్రత॥"

"ఈ దేహంలో జ్ఞానమనే రత్నం ఉంది! దీన్ని కామక్రోధ లోభాలనే దొంగలు దొంగిలించటం కోసం వేచి ఉన్నారు! కనుక మేలుకో, మేలుకో" అంటుంది మరొక సంప్రదాయక కీర్తన!

ఇలాంటి మేల్కొల్పు గీతికలు సంస్కృతంలోనూ, తెలుగులోనూ ఎన్నో ఉన్నాయి! ఈనాడు దురదృష్టంచేత వాటి స్మరణే మనకు పట్టటం లేదు!

ప్రతి ఉదయమూ మన దేవాలయాల్లోని దైవాన్ని సుప్రభాత స్తోత్రాలు చేస్తూ మేల్కొల్పటం ఒక సంప్రదాయం. భగవంతుడు నిద్రపోయేవాడూ కాడు, మేల్కొనేవాడూ కాడు!! అటువంటి దైవానికి సుప్రభాత గీతాలతో మేల్కొల్పులు ఏమిటి? అనిపించవచ్చు! మన

హృదయాల్లోనే, హృదయ మందిరాల్లోనే ఆత్మ స్వరూపుడైన భగవంతుడు మన వెంట, జంట, ఇంట ఉంటూనే ఉన్నాడు. కనుక దైవానికి సుప్రభాతం పాడటం ద్వారా, మనలోని నిద్రించే దైవాన్ని మనం మేల్కొల్పుతున్నాం, అని తెలుసుకోవటం అవసరం! మనం అందరం ఆంగ్లకవి ఎమర్సన్ దృష్టిలో నిద్రించే దేవతలం! భక్తి మార్గంలో ఈ భావంతోనే శ్రీవేంకటేశ్వర సుప్రభాతం, శ్రీ భద్రాద్రి.రామ సుప్రభాతం, శ్రీ దేవీసుప్రభాతం వంటి సుప్రభాత గీతాలను భక్తులైన వారు ప్రాతఃకాలములో ఆలపించటంలో గల ఆంతర్యం ఇదే!

ఇది ఇలా ఉండగా మహాభారతంలో ధర్మరాజుల వారు తనకు తానే తనకోసం సుప్రభాతం పాడుకొంటాడు! పురుషప్రయత్నంద్వారా కర్మనిష్ఠులైన కర్మయోగులందరూ తమలోగల పౌరుషాన్ని మేల్కొల్పటానికి సంకేతంగా ధర్మరాజు పాడిన మేలుకొలుపు గీతాన్ని గూర్చి మనం తెలుసుకోవాలి.

"బ్రహ్మామురారి స్త్రిపురాంత కారీ
భాను: శశీభూమి సుతో బుధశ్చ
గురుశ్చ శుక్రః సహ భానుజేన
కుర్వన్తు సర్వే మమ సుప్రభాతం'

(వామనపురాణం)

"బ్రహ్మవిష్ణు మహేశ్వరులూ, ఆదిత్యాది నవగ్రహములూ నాకు సుప్రభాతమును కలిగించెదరుగాక! సప్తఋషులు, సప్తసముద్రములు, సప్తస్వరములు, సప్తకులపర్వతములు, సప్త ఊర్ధ్వలోకములు, సప్త అధోలోకములు, పంచభూతములు, భృగు, వశిష్ఠ, క్రతు, అంగీరస, మను, పులస్త్య, పులహ, గౌతమ, రైభ్య, మరీచి, చ్యవన, ఋభు, మొదలగు వారందరు నాకు సుప్రభాతమును కలుగజేసెదరుగాక" అంటూ ధర్మరాజు సుప్రభాతం పాడుకొనేవారు.

జ్ఞానయోగసాధకులంతా తమయొక్క దివ్యాత్మ తత్త్వాన్నే లక్ష్యంగా పెట్టుకొని సాధన చేస్తారు.

"ప్రాతర్భజామి హృది సంస్ఫుర దాత్మ తత్త్వం
సచ్చి త్సుఖం పరమహంసగతిం తురీయం
యత్స్వప్న జాగర సుషుప్తి మనైతి నిత్యం
తద్బ్రహ్మ నిష్కళ మహం నచ భూత సంఘః॥ "

"నాయందే ఉన్నటువంటి నా యొక్క ఆత్మతత్త్వాన్ని నేను ఈ ప్రాతఃకాలంలో కీర్తిస్తాను. నా నిజతత్త్వము సచ్చిదానంద మయమైనటువంటిది. జాగ్రత్, స్వప్న, సుషుప్తి అవస్థలకు అతీతమైన తురీయ స్థితిలో నేను పరమహంసనై నిత్యతత్త్వాన్ని అనుభవిస్తాను. నేను పంచభూతములతో కూడిన ఈ నామ రూపాత్మక జగత్తుకంటె భిన్నమైన బ్రహ్మతత్త్వాన్ని! నిష్కళారూపమైన ఈ రీతిగా భక్తులు తమ ఇష్టదైవాన్ని తమ హృదయ మందిరాల్లోనే మేల్కొల్పటం, కర్మయోగులు తమయొక్క పురుషాకారాన్ని తమలో మేల్కొల్పటం, జ్ఞానులు తమ యొక్క నిజతత్త్వాన్నే స్తుతించటం అనే మూడురీతులుగా ఈ సుప్రభాత సంకీర్తనం మన సంస్కృతిలో ఎంతో ప్రాముఖ్యత వహించింది.

తెల్లవారుఝామునే నిద్రలేచి దైవస్మరణచేస్తూ, దైవాన్ని కీర్తిస్తూ బజార్ల వెంబడి భజన చేసుకుంటూ వెళ్ళే భక్త బృందాలు మనకు ప్రతి పల్లెలోనూ, ప్రతి పట్టణంలోనూ కనబడుతూ ఉంటారు. భగవాన్ శ్రీ సత్యసాయి సంస్థలలో ఈ రీతిగా ప్రాతఃకాలంలో నగర సంకీర్తన కావించటం ఒక ప్రముఖమైన ఆధ్యాత్మిక సాధనగా నిర్వహింపబడుతోంది.

మనిషిలోని మానవత్వాన్ని మేల్కొల్పటం కోసం, ముందుగా మనిషి యొక్క మనస్సు విశిష్ఠ గుణ సంపన్నం కావాలి. తనను తాను ఉద్ధరించుకోవటం అనేది ముందుగా తనంతట తాను మేలుకోవటంతో ప్రారంభిస్తుంది!

"ప్రియవచన వాదీ ప్రియో భవతి
విమృశిత కార్యకరో2ధికం జయతి
బహుమిత్రకరః సుఖం వసతే
యశ్చ ధర్మరతః స గతిం లభతే"

అందరితోనూ ప్రియంగా మాట్లాడేవాడు అందరికీ ప్రీతిపాత్రుడవుతాడు. ఆలోచించి పని చేసేవాడు అందరిలోనూ గొప్పవాడౌతాడు. స్నేహితులెక్కువగా ఉన్నవాడు సుఖపడుతాడు. ధర్మంపైన ఆసక్తి ఉన్నవాడు ఉత్తమగతిని పొందుతాడు.

# బైజుబావ్రా

జానమద్ది హనుమచ్ఛాస్త్రి

మొఘల్ చక్రవర్తి అక్బర్ సకల కళాప్రియుడు. దేశంలోని అగ్రశ్రేణి సంగీత విద్వాంసులు, కవులు, తత్త్వవేత్తలు తన ఆస్థానంలో ఉండాలన్న మహదాశయం అతనికి ఉండేది. తాన్‌సేన్ సంగీత విద్వాంసులలో అసమానుడు. అతనికి సాటిరాగల గాయకుడు ఎవరూ తన దేశంలో ఉండకూడదని అక్బర్ ఆకాంక్ష. తాన్‌సేన్‌తో సంగీత స్పర్ధకు దిగిన వారి నందరినీ చెరసాలకు పంపాడు అక్బర్. బైజూ అనే గాయకుడు మాత్రం తాన్‌సేన్‌ను ఎలాగైనా ఓడించాలని సంకల్పించాడు. పట్టుదలతో సంగీతసాధన సాగించాడు. బైజు పట్టుదలను విన్న ప్రజలు అతన్ని 'బావ్రా' అంటూ ఎద్దేవా చేయసాగారు. బావ్రా అంటే పిచ్చివాడని అర్థం. తాన్‌సేన్ పరాజయమే తన జీవితలక్ష్యమన్నాడు పిచ్చిగాయకుడు. అవిశ్రాంతంగా సాధన కొనసాగించాడు, చివరకు తాన్‌సేన్ గురువుగారైన స్వామి హరిదాస్ గారివద్దకు వెళ్ళాడు. బైజుబావ్రాను చూచి స్వామి సంతోషించాడు. తాన్‌సేన్‌వంటి మరొక శిష్యుడు తనకు లభించగలడని స్వామి ఊహించలేదు.

"బైజూ! నీలో గొప్ప సంగీత విద్వాంసుడుకాగల శక్తి ఉంది. కాని నీలో ఒక లోపం ఉంది. నీ సంగీతంతో ఎవరినో ఓడించాలన్న తీవ్రమైన కోరిక ఉంది. అది నిన్ను వెంటాడుతూ ఉంది. సంగీతానికి నీ హృదయంలో చోటులేదు. ఎవరినో జయించాలన్న తపనతో సతమతమౌతున్నావు. దానిని ముందు తొలగించుకో, అంతవరకు నీవు తాన్‌సేన్ స్థాయినందుకోలేవు. తాన్‌సేన్‌కు ఎవరినీ జయించాలన్న ఆకాంక్షలేదు. కాబట్టే అతడు విజయం సాధిస్తున్నాడు."అన్నారు హరిదాసస్వామి.

తన వాంఛను వదలుకోవటం కష్టమనుకున్నాడు బైజు. ఈ ఒక్క లక్ష్యసాధన కోసమే తన జీవితమంతా సంగీతాధ్యయనానికి అంకితం చేశాడు. కాని గురువుల ఆదేశం అనుల్లంఘనీయం. క్రమంగా తాన్‌సేన్‌ను మరచి పోసాగాడు. ఒకమారు వృద్ధులైన హరిదాస స్వామి వ్యాధి పీడితులయ్యారు. ఒక కాలు పార్శ్వ వాయు గ్రస్తమైంది. సమీపంలోని శ్రీకృష్ణాలయానికి వెళ్ళటానికి కూడా సాధ్యం కాలేదు. శ్రీకృష్ణదర్శనం లేనిదే వారు జలపానం కూడా చేసేవారు కారు. ప్రముఖ వైద్యులెందరో చికిత్స చేశారు. ఫలితం శూన్యం.

సమీపగ్రామంలో ఉన్న బైజుబావ్రా ఈ వార్త విన్నాడు. వెంటనే పరుగులు తీస్తూ హరిదాస స్వామి సన్నిధి చేరాడు. సరిగా హరిదాసస్వామి నిద్రలేచే వేళకు తన గానం ప్రారంభించాడు. ఎంతో శ్రావ్యంగా పాడుతున్నాడు. ఆ పాట భావం: "నిన్ను చూడాలని నా కళ్ళు పరితపిస్తున్నాయి. నా కాళ్ళకు శక్తిని ప్రసాదించు, లేకున్న నిన్ను చూడక పోవటానికి నీవే బాధ్యుడవు కావాల్సి ఉంటుంది. నన్ను వదలకు."

బైజు కంఠస్వర మాధుర్యం అత్యంత శక్తిమంతం. స్వామి హరిదాస్ లేచి నిల్చున్నారు. మెల్లగా నడుస్తూ శ్రీకృష్ణాలయం చేరి స్వామిని పూజించారు. తిరిగి వస్తూ దారిలో, "బైజూ, ఇపుడు నీవు తాన్‌సేన్‌తో పోటీపడవచ్చు. ఇపుడు నీలో విజయం సాధించితీరాలన్న ఆకాంక్ష లేకపోవచ్చు. నీ సంగీతంతో, నాకాళ్ళు శక్తిని సంతరించు కున్నాయంటే, నీ సాధన అసామాన్యమైనది. మహత్తర శక్తిని సాధించావు" అంటూ ఆనందభాష్పాలు రాల్చారు హరిదాసస్వామి. "అయ్యా, ఇపుడు సంగీతం నా జీవన ధర్మంగా పరిణమించింది. అదే నా సర్వస్వం. నేను తాన్‌సేన్‌ను పూర్తిగా మరచాను. అదొక అల్పమైన కోరిక. తాము చెప్పిన మాటలు నాకు కనువిప్పు కలిగించాయి. తమ అనుగ్రహంవల్ల నేను విజయం సాధించగలను. కాని నాకు అటువంటి ఆసక్తి లేదు." అన్నాడు. స్వామి నవ్వుతూ 'బైజూ, ఇపుడు నీవు నిజంగా బావ్రావే (పిచ్చివాడివే) ఇపుడు నీవు సులువుగా తాన్‌సేన్‌ను ఓడించగలవు' అన్నాడు.

బైజూ పోటీకి వెళ్ళలేదు. హరిదాసుల పలుకుల్లో అతిశయోక్తి ఏమాత్రం లేదు. బైజు తాన్‌సేన్ కంటే గొప్పగా సాధించాడు. కానీ పోటీనుండి విరమించుకొని సంగీతం స్పర్ధకు దిగే వస్తువు కాదని, అత్యంత పవిత్రమైనదని బైజు నిరూపించాడు. 'బైజూ నాదయోగి'గా పరిణమించాడు. ●

మనోభిరామం-30

# గురు శిష్య బాంధవ్యము

గురువు బోధిస్తాడు. శిష్యుడు గ్రహిస్తాడు. గురువుది బోధన. శిష్యునిది సాధన. ఈ రెండింటిలోనూ క్రమశిక్షణ అంతర్గతము. గురువు శిష్యుణ్ని ప్రేమిస్తాడు. శిష్యుడు గురువుని గౌరవిస్తాడు. వీరిరువురి బాంధవ్యము పరస్పరాశ్రయము. గురువుని కీర్తి శిఖరాలనిలిపేది శిష్యుని ప్రజ్ఞాపాటవాలు! శిష్యుని ప్రతిభా వ్యుత్పత్తులను ప్రోదిచేసి పెంపు చేసేది గురువు. శిష్యుని చూసి గురువు గర్వముతో శిరవెత్తుతాడు! గురువును చూసి గౌరవముతో శిరసొంచుతాడు శిష్యుడు! గురువు ఆదేశాల నౌదల దాల్చువాడు శిష్యుడు! శిష్యుని సేవాభావానికి ఎదపొంగులు వారేది గురువు! గురువులేని శిష్యుడుండటం ఎంత అసంభవమో- శిష్యుడులేని గురువు ఉండడం అంతే విడ్డూరం! గురువు కష్టాలకు శిష్యుడు కరిగి నీరై పోతాడు!శిష్యుని ఆపదలకు గురువు ఆవేదన చెందుతాడు!

భరద్వాజ సుతుడు ద్రోణుడు, పాంచాల దేశాధిపతి పుత్రుడు ద్రుపదుడు బాల్యమిత్రులు. భరద్వాజాశ్రమంలో వారిరువురు సహాధ్యాయులై వేదాభ్యాసంతో, వివిధ విద్యలు నేర్చుకొని పెరిగి పెద్దవారైనారు. ద్రుపదుడు పాంచాలాధిపతిగ పట్టాభిషిక్తుడయ్యాడు. ద్రోణుడు అగ్నివేశుని శుశ్రూషలో ఆగ్నేయాస్త్రాది శస్త్రాస్త్రముల నవగాహన చేసికొన్నాడు. భార్గవరాముని అనుగ్రహంవల్ల మహాస్త్రాలనెన్నో గ్రహించాడు. కాని దుర్భర దారిద్ర్యబాధ భరించలేక, చిన్ననాటి స్నేహితుడు ద్రుపదుని సందర్శించ బయలుదేరాడు. మహారాజు ద్రుపదుడు, ద్రోణుని చూచినను, మర్యాద చేయలేదు సరికదా పలుకరించనైన పలుకరించలేదు. అయిననూ ద్రోణుడే తన బాల్యస్నేహాన్ని గుర్తుచేశాడు. అందుకు ఆ ధరణీపతి, ద్రోణుని అవహేళన చేస్తూ అమర్యాదకరంగా తూష్ణీభావంతో తిరస్కారం చేశాడు. అవమానభారంతో కృంగిపోయిన ద్రోణాచార్యుడు భార్యా బిడ్డలతో హస్తినాపురం చేరాడు. పాండవ ధార్తరాష్ట్ర నందనులకు ధనుర్విద్యా బోధన చేయసాగాడు. విద్యాభ్యాసానంతరం గురుదక్షిణగ ద్రుపద మహారాజును బంధించి తన పాదముల చెంత పడవేయమని కోరాడు. కౌరవ యోధులందరు ఆడంబరముగపోయి, ద్రుపదునితో కలబడి పరాజయాన్ని చవిచూశారు. అంతట అర్జునుడు రంగ ప్రవేశంచేసి కనురెప్పపాటు కాలంలో ద్రుపదరాజు రథంపైకి సింహంవలె లంఘించాడు. అసహాయశూరుడై పోరి, ఆ గర్వోన్నతుని పెడరెక్కలు విరిచికట్టి, నిర్బంధించి, ఆచార్య దేవుని పాద సన్నిధికి తోడ్కొని పోయి, సభక్తికంగా గురుదక్షిణ సమర్పించుకొన్నాడు.

## సోమంచిరామం

శిష్యుని గురుభక్తికీ ఉదంతం ఒక ఉత్కృష్టమైన ఉదాహరణ! సాందీపని గురువు వద్ద కృష్ణుడు, కుచేలుడు చిన్ననాటి సహాధ్యాయులు. కుచేలుడు బహుసంతానంతో దుర్భర దారిద్ర్యాన్ని అనుభవిస్తున్నాడు. అయినా తన లేమికెన్నడు దుఃఖించక, కలిగిన దానితోనే కాలక్షేపం చేస్తున్నాడు. భార్యకూడ ఓరిమితో పాతివ్రత్య నియమం తప్పకుండా జీవనం సాగిస్తోంది. చిన్ననాటి మిత్రులు శ్రీకృష్ణుని సందర్శించి, సహాయ మర్థించరాదాయన్న భార్య మాట కాదనలేక కుచేలుడు పిడికెడటుకులు చెంగున కట్టుకొని ద్వారక చేరాడు. కుచేలుని చూసిన శ్రీకృష్ణుడు ఎదురేగి ఆప్యాయంగా కౌగిట చేర్చుకొని, సకల మర్యాదలు చేసి ఇష్టాగోష్ఠి ప్రసంగం చేశాడు! "మిత్రమా! గురుకుల విద్యాభ్యాస కాలంలో మనం గడిపిన రోజులు, ఆడిన క్రీడలు గుర్తున్నాయా! మన గురువులు సాందీపని ఎంత ఆదరంతో ఉండేవారు!..నీకు గుర్తుందా! ఒకనాడు కట్టెలకోసం అడవికెళ్లాము. ఆ సాయంత్రం నుంచే తెల్లవార్లూ కుండపోతగా వర్షం కురిసింది. కన్ను పొడుచుకున్నా కనుపించని అడవిలో, చలిలోరాత్రి గడిపాము. తెల్లవారాక మనం ఆశ్రమాభిముఖంగా బయలుదేరాం! అప్పటికే గురువుగారు ఆందోళనతో మనకోసం వెతుకుతూన్నారు! మనలను చూడగానే ఆనందంతో అక్కున చేర్చుకొని కంటతడిపెట్టారు. ఎంతోబాధపడ్డారు.జ్ఞాపకముందా!"-అంటూ బాల్య స్మృతులు గుర్తుచేశాడు. శిష్యులపై గురువుకుండే వాత్సల్యానికీ వృత్తాంతమొక దృష్టాంతము. అందుకే గురుశిష్య బాంధవ్యము విడదీయలేనిది- విడదీయరానిది.

# తెలుగు ఉత్కళ సాంస్కృతిక వారధి విక్రమ దేవవర్మ

1920వ దశకంలో బరంపురంనుంచి బళ్ళారి వరకు ఉన్న తెలుగు ప్రజల ఉన్నత విద్యావసరాలు తీర్చడానికి విశాఖపట్నంలో స్థాపించబడిన ఆంధ్రవిశ్వ విద్యాలయం అనతికాలంలోనే దేశంలో అగ్రగణ్య విద్యా కేంద్రముగా పరిణతి చెందడానికి రెండు కారణాలు ఉన్నాయి. ఒకటి విద్యాబోధనలో ఉన్నత ప్రమాణాలు నెలకొల్పగలిగిన అధ్యాపక వర్గం. రెండు విశ్వ విద్యాలయాన్ని బాలారిష్టదశలో ఆర్థికంగా ఆదుకున్న వదాన్యులు. విశ్వవిద్యాలయ తొలి ఉపాధ్యక్షులైన కట్టమంచి రామలింగారెడ్డి, సర్వేపల్లి రాధాకృష్ణ పండితులు విశ్వవిద్యాలయానికి విద్యా ప్రమాణ విషయాలలో బలమైన పునాదులువేశారు. అదేవిధంగా ఎందరో వదాన్యులు భూరి విరాళాలు ఇచ్చారు.. అట్టి వారిలో ప్రాతః స్మరణీయుడు ఒరిస్సాలోని జయపురం మహారాజ విక్రమదేవవర్మ.

ఆంధ్ర విశ్వవిద్యాలయాన్ని సందర్శించిన వారెవరయినా సైన్సు అండ్ టెక్నాలజీ కాలేజీని దాని ముందు ఉన్న విక్రమదేవ వర్మ కాంస్య విగ్రహాన్ని చూడకుండా ఉండలేరు.

ఆంధ్రవిశ్వవిద్యాలయంలో ఫిజిక్స్ శాఖ స్థాపించినప్పుడు అప్పటి వైస్ ఛాన్సలర్ సర్వేపల్లి రాధాకృష్ణన్ అభ్యర్ధన మేరకు తొలి విడతగా ఏభైవేలరూపాయలు విరాళం ఇచ్చారు. ఆ తర్వాత దాన్ని డెబ్భైఐదువేల రూపాయలకు పెంచారు. ఆ తర్వాత లక్షరూపాయలు పెంచారు. అంతేకాక తన తదనంతరం తన వారసులు విశ్వవిద్యాలయానికి పదిహేను లక్షల రూపాయలు విరాళంగా ఇచ్చేటట్టు ఏర్పాటు చేశారు. ఆంధ్రవిశ్వవిద్యాలయపు తొలి రోజులలో ఎదుర్కొన్న ఆర్థిక ఇబ్బందులను తొలగించారు. 1937నుంచి జీవితాంతం విక్రమదేవవర్మ ఆంధ్రవిశ్వవిద్యాలయ ప్రోఛాన్సలర్‌గా దాని సర్వతోముఖాభివృద్ధికి అవిరళ కృషి చేశారు. విక్రమ దేవవర్మగారు చల్లని హస్తంతో అందించిన సహాయంవలన విశ్వవిద్యాలయం సైన్సు విభాగం-ముఖ్యంగా ఫిజిక్స్ న్యూక్లియర్ ఫిజిక్స్ శాఖలు-అంతర్జాతీయ గుర్తింపును పొందాయి. ఈనాడు ఆంధ్ర విశ్వవిద్యాలయం నుండి డిగ్రీలు, డాక్టరేట్లు పొందిన భౌతిక, అణుభౌతిక శాస్త్రవేత్తలు మన దేశంలోనేకాక విదేశాలలో కూడా గుర్తింపు తీసుకు వచ్చారు.

ఆంధ్రలోనేకాక ఒరిస్సాలో విద్యావ్యాప్తికి విక్రమదేవవర్మ భూరి విరాళాలు ఇచ్చారు. కటక్‌లోని ఎస్.సి.బి. మెడికల్ కాలేజీకి లక్షా ముప్పయివేల రూపాయలను విరాళంగా ఇచ్చారు. ఉత్కళ విశ్వ విద్యాలయంలో పోస్టు గ్రాడ్యుయేషన్ స్కాలర్‌షిప్‌కు పదివేల రూపాయలు విరాళంగా ఇచ్చారు. జయపురంలో ఆయన స్థాపించిన విక్రమదేవ ఆర్ట్సు సైన్సు కాలేజీలు గత సంవత్సరం స్వర్ణోత్సవాలను జరుపుకున్నాయి.

కంచి వాసుదేవరావు

జయపురం రాజవంశీయులైన విక్రమదేవవర్మ 1869 జూన్28వ తేదీన జన్మించారు. రాజకుటుంబంలో జన్మించినప్పటికీ ఆయన రాజరికానికి దూరంగా ఉండిపోయారు. తల్లిదండ్రులను కోల్పోయారు. జయపురంమహారాజా విక్రమదేవవర్మకు నెలనెలా కొంత భరణం అందజేస్తూ ఉండేవారు. ఆయన విశాఖపట్టణంలో నిరాడంబర జీవితం గడుపుతూ ఉండేవారు. తెలుగు, ఒరియా భాషలలో పాండిత్యాన్ని సంపాదించుకున్న విక్రమదేవవర్మకు తెలుగు సాహిత్యంపై అభిమానం ఏర్పడింది. విశాఖపట్టణంలో ఆనాడు ఉన్న అనేకమంది తెలుగు కవులతోనూ, పండితులతోనూ పరిచయం ఏర్పడింది. తెలుగులో అనేక రచనలు చేశారు. శృంగార కంఠాభరణం, రాధామాధవం, బుద్ధచరిత్రం అనే నాటకాన్ని తెలుగులో రచించారు. ఆయన కథారచయిత కూడా. గ్రాంధిక బాషావాది అయిన విక్రమదేవవర్మ కథలను కూడా గ్రాంధికభాషలో వ్రాశారు.

ఆంధ్రపురాణ రచయిత మధునాపంతుల సత్యనారాయణ శాస్త్రిగారు 1940వ దశకంలో 'ఆంధ్రి' అన్న పేరుతో ఒక విశిష్ట సాహిత్య మాస పత్రికను నడుపుతూ ఉండేవారు. ఆ పత్రికకు ఆనాటి ప్రముఖ రచయితలు తమ రచనలను పంపి ప్రోత్సహించేవారు. విక్రమదేవవర్మ కూడా ఈ సాహిత్య పత్రికను ప్రోత్సహిస్తూ వచ్చారు. ఆయన రచించిన "అభాగిని"అనే లఘు కథను 'ఆంధ్రి' ప్రచురించింది. రాజవంశీయులైన విక్రమదేవవర్మ ఒక ఫ్యాక్టరీలో పనిచేస్తూ వంచనకు గురిఅయిన ఒక అమాయక స్త్రీ గాధను ఇతివృత్తంగా స్వీకరించటం ఆయనలో గల సామాజిక స్పృహకు నిదర్శనం.

విక్రమదేవవర్మకు ఒరియా సాహిత్యంలో కూడా మంచి ప్రవేశంఉంది. ఆధునిక ఒరియా కవులలో ఆద్యుడైన ఫకీర్‌మోహన సేనాపతి ప్రభావం ఆయనపై ఉంది. ఆయన ఒరియా రచనలలో సంప్రదాయక పోకడలు, ప్రకృతి సౌందర్య వర్ణనలు రమణీయంగా ఉంటాయని ఒరియా సాహిత్య విమర్శకుల అభిప్రాయం.

"ఒరియా తెలుగు సంస్కృత భాషలలో కథా రచనలు, వ్యాసరచనలు, విమర్శలు, నాటకాలు, కవిత్వాన్ని సృష్టించారని ఎ.వి.డి శర్మ అనే పండితుడు "ఇంటిగ్రేషన్ ఆఫ్ ఆంధ్రా అండ్ ఒరిస్సా" అనే పుస్తకంలో ప్రశంసించారు. మరో విధంగా చెప్పాలంటే విక్రమదేవ వర్మ ఆంధ్ర ఉత్కళ సంస్కృతిలను తనలో లీనం చేసుకుని ఆరెండింటికీ వారధిగా నిలిచారు.

1933 ఆంధ్ర విశ్వవిద్యాలయం ఆయనను డిలిట్‌తో సత్కరించింది. 1941లో భారతీ తీర్థ రీసెర్చి సొసైటీ "లార్డ్స్ ఆఫ్ లెటర్స్" అనే బిరుదుతో సత్కరించింది. 1936లో ఒరిస్సా రాష్ట్ర అవతరణ తరువాత 1937లో జరిగిన ఒరియా సాహిత్య సమావేశం ఒరియా భాషకు చేసిన విశిష్ట సేవలకు గుర్తింపుగా ఆయనను ఘనంగా సన్మానించింది.

జయపురం సంస్థానాన్ని పరిపాలించిన నాల్గవ రామచంద్రదేవ సంతానహీనుడుగా 1931లో మరణించారు. రాజవంశీయుడైన విక్రమ దేవవర్మ జయపుర సంస్థానాధీశునిగా నిర్ణయించబడ్డారు. ఆయన తన 62వ యేట జయపుర సంస్థానాధీశుడయ్యారు.

రెండు దశాబ్దాలు జయపురం సంస్థానాన్ని ప్రజా రంజకంగా పాలించారు. సంస్థానాధీశుడు కాక ముందు ఆయన సామాన్య వ్యక్తిగా నిరాడంబర జీవితం గడిపారు. సంస్థానాధీశుడయినా ఎట్టి భేషజాలు, ఆడంబరాలకు పోకుండా నిరాడంబర జీవితం గడుపుతూ "రాజర్షిగా" పేరు తెచ్చుకున్నారు. పేదల పాలిట పెన్నిధిగా పేరు తెచ్చుకున్నారు. ఆయన దగ్గరకు వచ్చిన సహాయార్థులు రిక్త హస్తాలతో తిరిగి వెళ్ళే వారు కాదని అంటారు. ఆయన దాతృత్వ విశేషాలను ఇప్పటికీ జయపురం ప్రజలు కృతజ్ఞతాభావంతో స్మరించుకుంటూ ఉంటారు. ఒక సంస్థానాన్ని పరిపాలించే రాజుగా కాక ఒక సామాన్య వ్యక్తిగా, సామాన్య జన శ్రేయోభిలాషిగా గుర్తింపు పొందారు. ఆ విధంగా ప్రజల హృదయాలలో చెరగని ముద్ర వేశారు.

ఆంధ్ర విశ్వవిద్యాలయ ఉద్ధారకునిగా తెలుగు సాహితీ వేత్తగా, సాహిత్య పోషకునిగా దానశీలిగా తెలుగు ప్రజలు ఈ ఒరియా పుత్రరత్నాన్ని కలకాలం గుర్తుంచుకుంటారు. 

## శ్రీవాణి జీవిత సభ్యులు



**Sri V. JANARDHAN REDDY**
*Correspondent,*
C.R.R. Residential
High School,
KURNOOL



**SRI JAYANTY
SRI RAMA MURTHY**
Pimpri,
PUNE - 411 018

భగవాన్ శ్రీ శ్రీ శ్రీ సత్యసాయి సద్గురు

# పాదుకాష్టోత్తర శతనామావళిః

గురు బ్రహ్మ గురుర్విష్ణుః
గురుర్దేవో మహేశ్వరః
గురుస్సాక్షాత్ పరబ్రహ్మ
తస్మై శ్రీ గురవే నమః

ఓం శ్రీం పర్తీశ్వర పాదుకాభ్యాం నమః
ఓం శ్రీం పరమగురు పాదుకాభ్యాం నమః
ఓం శ్రీం పరమ పావన పాదుకాభ్యాం నమః
ఓం శ్రీం పాప విమోచక పాదుకాభ్యాం నమః
ఓం శ్రీం కలి కల్మషహర పాదుకాభ్యాం నమః
ఓం శ్రీం కామితార్థ ప్రదాయక పాదుకాభ్యాం నమః
ఓం శ్రీం మునిజన సేవిత పాదుకాభ్యాం నమః
ఓం శ్రీం ముక్తి ప్రదాయక పాదుకాభ్యాం నమః
ఓం శ్రీం భవభయహర పాదుకాభ్యాం నమః
ఓం శ్రీం సకలైశ్వర్య ప్రదాయక పాదుకాభ్యాం నమః
ఓం శ్రీం సంశయహర పాదుకాభ్యాం నమః
ఓం శ్రీం సచ్చిదానందదాయక పాదుకాభ్యాం నమః
ఓం శ్రీం సద్గతిదాయక పాదుకాభ్యాం నమః
ఓం శ్రీం సర్వమంగళకర పాదుకాభ్యాం నమః
ఓం శ్రీం సంసారపంకనిర్మగ్న సముద్ధరణ పాదుకాభ్యాం నమః
ఓం శ్రీం అక్షయపరబ్రహ్మ పాదుకాభ్యాం నమః
ఓం శ్రీం హరిహరరూప పాదుకాభ్యాం నమః
ఓం శ్రీం ధర్మార్థకామమోక్ష ప్రదాయక పాదుకాభ్యాం నమః
ఓం శ్రీం ప్రశాంతిదాయక పాదుకాభ్యాం నమః
ఓం శ్రీం ధర్మక్షేత్ర స్థాపక పాదుకాభ్యాం నమః
ఓం శ్రీం బ్రహ్మానంద ప్రదాయక పాదుకాభ్యాం నమః
ఓం శ్రీం అభయ ప్రదాయక పాదుకాభ్యాం నమః
ఓం శ్రీం ఆర్తత్రాణ పరాయణ పాదుకాభ్యాం నమః
ఓం శ్రీం శంఖచక్ర రేఖాంకిత పాదుకాభ్యాం నమః
ఓం శ్రీం పద్మ రేఖాంకిత పాదుకాభ్యాం నమః
ఓం శ్రీం జోడి ఆదిపల్లి సోమప్ప పాదుకాభ్యాం నమః
ఓం శ్రీం యోగీశ్వరేశ్వర పాదుకాభ్యాం నమః
ఓం శ్రీం శివ శక్త్యాత్మక పాదుకాభ్యాం నమః
ఓం శ్రీం సుందర రూప పాదుకాభ్యాం నమః
ఓం శ్రీం సుకుమార సుందర పాదుకాభ్యాం నమః
ఓం శ్రీం భక్తాభీష్ట ప్రదాయక పాదుకాభ్యాం నమః
ఓం శ్రీం ముముక్షు గణసేవిత పాదుకాభ్యాం నమః
ఓం శ్రీం మునిజన వందిత పాదుకాభ్యాం నమః
ఓం శ్రీం అమృత ప్రదాయక పాదుకాభ్యాం నమః
ఓం శ్రీం ఆర్తజన రక్షక పాదుకాభ్యాం నమః
ఓం శ్రీం ఆత్మ లింగోద్భవకర పాదుకాభ్యాం నమః
ఓం శ్రీం అష్టైశ్వర్య ప్రదాయక పాదుకాభ్యాం నమః
ఓం శ్రీం ప్రణతార్తి భంజన పాదుకాభ్యాం నమః
ఓం శ్రీం సత్యధర్మ శాంతి ప్రేమ ప్రచారక పాదుకాభ్యాం నమః
ఓం శ్రీం పద్మ గర్భారుణ సంకాశ పాదుకాభ్యాం నమః
ఓం శ్రీం నిశ్శ్రేయస పదప్రాప్తి పాదుకాభ్యాం నమః
ఓం శ్రీం అష్టసిద్ధిదాయక పాదుకాభ్యాం నమః
ఓం శ్రీం తాపత్రయ ప్రశమన పాదుకాభ్యాం నమః
ఓం శ్రీం ప్రసన్నార్తిహర పాదుకాభ్యాం నమః
ఓం శ్రీం బహుప్రదేశఘటకకాల స్వీకృత విభిన్నాపాధి
పాదుకాభ్యాం నమః
ఓం శ్రీం ఆపదుద్ధరణ పాదుకాభ్యాం నమః
ఓం శ్రీం సర్వరోగ ప్రశమన పాదుకాభ్యాం నమః
ఓం శ్రీం సర్వరక్షాకర పాదుకాభ్యాం నమః
ఓం శ్రీం సర్వక్లేశ హర పాదుకాభ్యాం నమః
ఓం శ్రీం సర్వానర్థహర పాదుకాభ్యాం నమః
ఓం శ్రీం విభూతి ప్రదాయక పాదుకాభ్యాం నమః
ఓం శ్రీం విభూతి సుందర పాదుకాభ్యాం నమః
ఓం శ్రీం విద్యాదాయక పాదుకాభ్యాం నమః
ఓం శ్రీం బ్రహ్మాండ వ్యాప్త పాదుకాభ్యాం నమః
ఓం శ్రీం తరుణాదిత్య సంకాశ పాదుకాభ్యాం నమః
ఓం శ్రీం నిర్గుణ పరబ్రహ్మ పాదుకాభ్యాం నమః
ఓం శ్రీం దీనలోక శరణ్య పాదుకాభ్యాం నమః
ఓం శ్రీం అన్నవస్త్రదాయక పాదుకాభ్యాం నమః
ఓం శ్రీం సంకల్ప మాత్ర పరికల్పిత వస్తు ప్రదాయక పాదుకాభ్యాం నమః
ఓం శ్రీం విశుద్ధ విజ్ఞాన ఘన స్వరూప పాదుకాభ్యాం నమః
ఓం శ్రీం అఖిల లోక శరణ్య పాదుకాభ్యాం నమః
ఓం శ్రీం నిగమాగమ రూప పాదుకాభ్యాం నమః

ఓం శ్రీం నిర్వికల్పానంద పాదుకాభ్యాం నమః
ఓం శ్రీం నిఖిలైశ్వర్య ప్రదాయక పాదుకాభ్యాం నమః
ఓం శ్రీం సంకల్ప మాత్ర పరికల్పిత చిత్రవిచిత్ర వస్తు ప్రదర్శక పాదుకాభ్యాం నమః
ఓం శ్రీం అగణిత గుణగణ పాదుకాభ్యాం నమః
ఓం శ్రీం సాధుమానస శోధక పాదుకాభ్యాం నమః
ఓం శ్రీం ఆది మధ్యాంతరహిత పాదుకాభ్యాం నమః
ఓం శ్రీం సాధక జనపోషక పాదుకాభ్యాం నమః
ఓం శ్రీం సాధకానుగ్రహవటవృక్ష ప్రతిష్టాపక పాదుకాభ్యాం నమః
ఓం శ్రీం గీతా బోధక పాదుకాభ్యాం నమః
ఓం శ్రీం సర్వారిష్ట నివారక పాదుకాభ్యాం నమః
ఓం శ్రీం అనేకజన్మ సముపార్జిత పాప సంక్షయకర పాదుకాభ్యాం నమః
ఓం శ్రీం త్రిభువనపాలక పాదుకాభ్యాం నమః
ఓం శ్రీం పూర్వ పుణ్యఫల ప్రదాయక పాదుకాభ్యాం నమః
ఓం శ్రీం మాయామానుష రూప పాదుకాభ్యాం నమః
ఓం శ్రీం మంగళ సూత్ర ప్రదాయక పాదుకాభ్యాం నమః
ఓం శ్రీం మందస్మిత ముఖారవింద పాదుకాభ్యాం నమః
ఓం శ్రీం మాత్సర్యనాశక పాదుకాభ్యాం నమః
ఓం శ్రీం భరద్వాజ ఋషిగోత్ర పాదుకాభ్యాం నమః
ఓం శ్రీం భక్త పరాధీన పాదుకాభ్యాం నమః
ఓం శ్రీం పుట్టపర్తి శాప విమోచక పాదుకాభ్యాం నమః
ఓం శ్రీం దుష్ట జనోద్ధరణ పాదుకాభ్యాం నమః
ఓం శ్రీం యక్ష కిన్నెర గంధర్వసేవిత పాదుకాభ్యాం నమః
ఓం శ్రీం గాయత్రీ దీక్షాదాయక పాదుకాభ్యాం నమః
ఓం శ్రీం జగద్గురు పాదుకాభ్యాం నమః
ఓం శ్రీం అనంత కల్యాణ గుణగణ పాదుకాభ్యాం నమః
ఓం శ్రీం అతిరూప లావణ్య పాదుకాభ్యాం నమః
ఓం శ్రీం అశేష జనవంద్య పాదుకాభ్యాం నమః
ఓం శ్రీం ఆద్యంత రహిత పాదుకాభ్యాం నమః
ఓం శ్రీం ఆది వ్యాధి హర పాదుకాభ్యాం నమః
ఓం శ్రీం ఆపస్తంబ సూత్ర పాదుకాభ్యాం నమః
ఓం శ్రీం గంగావతరణ నిదాన భూత పాదుకాభ్యాం నమః
ఓం శ్రీం యజమాన స్వరూప పాదుకాభ్యాం నమః
ఓం శ్రీం యజ్ఞఫల ప్రదాయక పాదుకాభ్యాం నమః
ఓం శ్రీం యజ్ఞ సంరక్షక పాదుకాభ్యాం నమః
ఓం శ్రీం రత్నాకర వంశోద్భవ పాదుకాభ్యాం నమః
ఓం శ్రీం వీణావాదన ప్రియ పాదుకాభ్యాం నమః
ఓం శ్రీం త్రయీబృందావన విహారి పాదుకాభ్యాం నమః
ఓం శ్రీం షిర్డీసాయి అభేద శక్త్యావతార పాదుకాభ్యాం నమః
ఓం శ్రీం సర్వలోక పూజ్య పాదుకాభ్యాం నమః
ఓం శ్రీం శబ్ద బ్రహ్మ స్వరూప పాదుకాభ్యాం నమః
ఓం శ్రీం సకల వ్యాధి నివారణ విశిష్ట వైద్యాలయ నిర్మాణ పాదుకాభ్యాం నమః
ఓం శ్రీం జ్ఞాన వైరాగ్య ప్రదాయక పాదుకాభ్యాం నమః
ఓం శ్రీం సర్వమత సన్నుత పాదుకాభ్యాం నమః
ఓం శ్రీం ప్రేమామృత ప్రదాయక పాదుకాభ్యాం నమః
ఓం శ్రీం సర్వ పుణ్య ఫలప్రద పాదుకాభ్యాం నమః
ఓం శ్రీం భగవాన్ శ్రీశ్రీశ్రీ సత్యసాయిసద్గురు పాదుకాభ్యాం నమః

భగవాన్ శ్రీ శ్రీ శ్రీ సత్యసాయి విశ్వవిద్యాలయాంధ్రాధ్యాపకేన
స్వామిశాస్త్రిణా నిర్మితేయం సత్యసాయి సద్గురు
పాదుకాష్టోత్తర శతనామావళిః
సమాప్తా

- ఎన్. స్వామి శాస్త్రి

## శ్రీవాణి జీవిత సభ్యులు



**Sri P. S. V. SUBRAHMANYAM**
**Smt. P. SURYA KANTAM**
SRIKAKULAM - 532 001.



**Sri J.V.R. SARMA**
**Smt. J. RUKMINI SARMA**
PRASANTINILAYAM